# THE
# ANDHRA PRADESH LEGISLATIVE ASSEMBLY DEBATES

[*Part II—Proceedings other than Questions and Answers*]

## OFFICIAL REPORT

---

*Eighth Day of the Sixth Session of the Andhra Pradesh Legislative Assembly*

---

## ANDHRA PRADESH LEGISLATIVE ASSEMBLY

*Tuesday, the 5th November,* 1957

The House met at Half Past Eight of the Clock

[MR SPEAKER IN THE CHAIR]

## QUESTIONS AND ANSWERS

(SEE PART I)

## COMMITTEE ON SUBORDINATE LEGISLATION

మిస్టర్ స్పీకర్  కమిటీ ఆన్ సబార్డినేట్ లెజిస్లేషన్‌కు కావలసినటువంటి 9 మంది సభ్యులను ఏకగ్రీవంగా ఎన్నుకున్నారు  ఈ 9 మంది సభ్యుల పేర్లు చదివి వినిపిస్తున్నాను.

1 Sri G Venkata Reddy Naidu, Minister.
2 Sri Gopalrao Ekbote.
3 Sri E Ayyapu Reddy
4 Sri S K V Krishnavataram
5 Sri Gadiraju Jagannadha Raju
6 Sri Dawar Hussain
7 Sri D V Subba Rao
8. Sri P Narsing Rao
9 Sri S Ranganatha Mudaliar

ఈ కమిటీకి కావలసిన 9 మంది సభ్యుల సంఖ్యకు పైన పేరులు రాలేదు. కాబట్టి వీరందరినీ ఏకగ్రీవంగా ఎన్నుకున్నట్లు ప్రకటిస్తున్నాను  ఆంధ్ర ఎసెంబ్లీ

రూల్సులోని 199 వ రూల్ ప్రకారం అందులో సభ్యులైన శ్రీ ఇ అయ్యపు రెడ్డిగారిని ఈ కమిటీ ఛైర్మన్‌గా నామినేట్ చేస్తున్నాను

## SECOND REPORT OF THE ESTIMATES COMMITTEE ON THE PUBLIC WORKS DEPARTMENT (IRRIGATION - KRISHNA BARRAGE)

*Mr Speaker* Now Hon Member Sri Gopala Rao Ekbote will present the second report of the Estimates Committee

*Sri Gopal Rao Ekbote (High Court)* I beg to present the Second Report of the Estimates Committee on the Public Works Department (Irrigation - Krishna Barrage)

*Mr Speaker* The Report is presented

## CALLING ATTENTION TO MATTERS OF URGENT PUBLIC IMPORTANCE POLICE FIRING NEAR CHINTALA VELAGAM VILLAGE

*Mr Speaker*· I have received the following notice from Sri B Srirama Murthy, calling the attention of the Minister

"I wish to call the attention of the Hon Minister for Home on an urgent matter of public importance, namely, 'resorting to firing by the Police during the last month near Chinthala Velagam in Parvathipuram Taluk of Srikakulam District at the time of a ram fight there which resulted in two deaths' "

గత నెలలో పార్వతీపురం దగ్గరనున్న చింతలవెలగం అనే గ్రామంలో police firing జరిగిందట. ఇద్దరు చనిపోయినారట కనుక దానిక్రింద నోటీసు యివ్వబడ్డది. ఏమైనా ఈవేళ సెలవిస్తారా లేక ఇంకోరోజుకు కావలయునా ?

*ముఖ్యమంత్రి (శ్రీ ఎన్. సంజీవరెడ్డి). ఇంకొక రోజుకు వద్దండి. అది ఇప్పుడు immediate కాదు. ఇప్పుడు జరిగినది కాదు. నిన్న, ఈ దినం జరిగిన urgent matter కాదు ఎప్పుడో గడచిన నెలలో జరిగింది Law and order maintain చేయుటలో జరిగిన incident అది. దానికి ప్రమాదమైన, బ్రహ్మాండమైనటువంటి importance ఇవ్వడం అవసరంలేదు. దానికి అంత ప్రాముఖ్యమే వుంటే అది ఎసెంబ్లీ ముందుకు గడచిన నెలలోనే వచ్చేది. అక్కడివారి దురదృష్టం, అలాగే ram fight జరగడం, ఫామ్మి జరగడం, ఉద్యోగస్థులపైన ఏదో

జరగడం ఇవన్నీ ఉన్నాయి అది అంత urgent కాదు అంత importance కూడా లేదని నేను చెబుతున్నాను

*శ్రీ బి శ్రీరామమూర్తి ఈ సంఘర్షణ జరిగిన తరువాత మొదటి మారు శాసనసభసమావేశం యిపుడేజరుగుతోంది అందుచేత ఇదివరకు రాలేదన్న ప్రశ్నే లేదు పోతే హెచ్చుమంది జనం సమావేశమైన సందర్భంలో పోలీసులు తుపాకి కాల్పులుకాల్చడం జరిగింది అది తీవ్రమైనటువంటివిషయం అది చిన్న విషయం కాదు తేలిక విషయం కాదు మనుష్యుల ప్రాణాలు పోగొట్టడానికి చేసినటువంటి ప్రయత్నంగా కనపడుతోంది అక్కడ విచారణ కూడా ఏర్పాటు చేశారు అందుచేత అతిముఖ్యం

శ్రీ ఎన్ సంజీవరెడ్డి విచారణ ఏర్పాటు చేశారని వారే చెప్తున్నారు కాబట్టి ఇక్కడ విచారించనక్కరలేదు

శ్రీ బి శ్రీరామమూర్తి విచారణ కూడా ఏర్పాటు చేసినందువల్ల అది ఎంత తీవ్రమైనటువంటి విషయమో తెలుస్తుంది, పోతే విచారణ ఏంజరిగింది ? ఎంతవరకు జరిగింది ? దానివల్ల ఏమైనా ఫలితాలు ఉన్నవా ? ఈ విషయాలు గురించి మాత్రం ఏమీ తెలియదు అందుచేత ఆ వివరాలు తయారుచేసి మంత్రి గారు అందచేస్తారా ?

శ్రీ ఎన్. సంజీవరెడ్డి వారు short notice question యిస్తే answer రూపంలో, తెప్పించి సమాధానం చెప్పడానికి సిద్ధంగా ఉన్నాము అక్కడ విచారణ జరుగుతోందని సభ్యునికి తెలుసు కాబట్టి ఇక్కడ ఈ House యొక్క యితర ముఖ్యపనులను అందుకొరకై ఆపటం అంత సమంజసము కాదు Question hour లో సమాధానం చెప్తాము. వారికి ఇష్టమైతే short notice question ఇవ్వవచ్చు

మిస్టర్ స్పీకర్ . విచారణ జరుగుతోందా ?

శ్రీ ఎన్. సంజీవరెడ్డి . విచారణ జరుగుతోంది.

మిస్టర్ స్పీకర్ . విచారణ రిపోర్టు వస్తుంది కదా ?

శ్రీ ఎన్ సంజీవరెడ్డి : తప్పకుండా వస్తుంది

మిస్టర్ స్పీకర్ : కనుక ఆ రిపోర్టు వచ్చిన తరువాత చూద్దాము, కనుక దీనిని short notice question గా అడగవలసిన అవసరం లేదు ఇది serious

matter కాను ఇది గడచిన నెలలో జరిగినది మొదటదఫా ఇపుడు సభలో అడగడానికి అవకాశం ఏర్పడినది కనుక ఇది matter of urgent public importance దానికేమీ సందేహంలేదు కాని ఇపుడు calling the attention of the Minister" అన్నారు Minister గారిని అది ఇపుడే స్థితిలో ఉన్నదని అడిగినారు గౌరవనీయులైన ముఖ్యమంత్రిగారు ఒక విచారణ కమిటీ ఏర్పడినదని సెలవిచ్చారు గౌరవసభ్యులు శ్రీరామమూర్తిగారు కూడా అదే అంటున్నారు. కనుక విచారణయొక్క రిపోర్టువచ్చిన తరువాత దానినిగురించి ఏమైనా మాట్లాడవలసి ఉంటే short notice question యివ్వటం కాని, లేక పోతే calling the attention of the minister కాని ఏదో తరువాత చూద్దాము. ప్రస్తుతం దీనిని గురించి ఆలోచించవలసిన అవసరం లేదని Ruling యిచ్చు చున్నాను

## BUSINESS OF THE HOUSE

శ్రీ వి. విశ్వేశ్వరరావు (మైలవరం) మొన్న K C Canal పైన Estimates Committee వారొక రిపోర్టు యిచ్చారు ఈ రోజున మళ్ళీ కృష్ణా బారేజిపైన ఒక రిపోర్టు యిచ్చారు వీటిని చర్చకు ఎపుడు పెడతారు అనేది సెలవిమ్మని మనవిచేస్తున్నాను

మిస్టర్ స్పీకర్ : దీని విషయంలో Lok Sabha యొక్క convention నేను తెల్సుకున్నాను మొన్న జరిగిన Speakers' conference లో కూడా చర్చకు వచ్చినది దీనిని గవర్నమెంటువారు బాగా విచారించవలసియున్నది. దీనిని ఇపుడు యిక్కడ ఊరికే చర్చించి ప్రయోజనంలేదు Congress Party, Communist Party, ఇతర పార్టీలవారు అందరూ ఉన్న Committee ఒక report యిచ్చారు అది సాధ్యమా? అసాధ్యమా? ఏది నిజం, ఏది అబద్ధం అనేటటువంటివిషయం ప్రభుత్వంవారు పూర్తిగా విచారణ చేయాలి అందులో ఏమైనా లోపాలుంటే వెంటనే వాటిని సవరించాలి ఆపైన వారిని అడగవలసి యున్నది. ఊరికే మామూలుగా adjournment motion క్రింద చర్చించడం, ఇంకా వారికేమీ తెలియకుండానే ప్రభుత్వంవారేదో చెప్పడం, ఎవరుపడితే వారు ఏదో చెప్పడం అనేది సాధ్యపడదు. కాబట్టి వీటి అన్నిటివిషయంలో ఒక convention ఉన్నది అదేమిటంటే మన House లో కూడా ప్రభుత్వంవారికి తగినంత time ఇవ్వాలి కనుక దీనిని ఇప్పుడే తీసుకోడానికి వీలులేదు. "The government must enquire into the whole matter and do whatever is possible to remedy the defects and then be ready for a discussion." ఇదీ convention. అందుచేత ప్రస్తుతం తారీఖు నిర్ణయించడంలేదు.

శ్రీ ఎమ్ నాగిరెడ్డి (మాచర్ల) అధ్యక్షా ! ఇపుడు బిల్లులకి తెలుగు కాపీలు ఇప్పిస్తున్నందుకు సంతోషం Amendments ను కూడా తెలుగులో యివ్వవచ్చాండి ?

మిస్టర్ స్పీకర్ ఇవ్వవచ్చు మీరు అన్నీ తెలుగులో ఇవ్వవచ్చు అన్నిటినీ తర్జుమాచేస్తారు తెలుగు, ఇంగ్లీషు రెండు కాపీలు మీకు అందచేయబడతాయి అని నేను నిన్ననే చెప్పాను

శ్రీ బసవమానయ్య (అంధోలు) అధ్యక్షా ! K C Canal విషయంలో శ్రీ గోపాలరావ్ ఎక్బోటేగారి అధ్యక్షత క్రింద Estimates Committee 2, 3 సమావేశాలు చేసుకొని అక్కడికి పోయి చూసుకొని చాలా క్షుణ్ణంగా వివరంగా పరిశీలించి అన్ని విషయాలు పైన యిచ్చిన రిపోర్టు మీదనే ఈ motion యివ్వ బడ్డది దీనినిBusiness Advisory Committee ఎదుటపెట్టి ఆలోచించి దానిని discussion కుపెడదామని శ్రీవారు చెప్పినారు అందుకోసమనే ఇపుడు ఆలోచించాలి 4 కోట్ల రూపాయలు ప్రజా ధననష్టం అయింది......

మిస్టర్ స్పీకర్ అంతా అయిపోయిన విషయం మళ్లీ బసవమాణయ్యగారు మొదలుపెట్టారు కనుక అట్లాగ వీలులేదు I call upon the hon. Revenue Minister to proceed with his speech.

శ్రీ ఎన్ పి. చెంగల్రాయనాయుడు (వేపంజేరి) నిన్న మంత్రిగారు ఏమి చెప్పినారో జ్ఞాపకంలేదు అందుచేత నిన్న చెప్పినవి కూడా మళ్లీ ఈ దినం టూకీగా చెప్పమనండి

## THE ANDHRA LAND REVENUE (ADDITIONAL WET ASSESSMENT) (ANDHRA PRADESH AMENDMENT) BILL, 1957 (Contd)

* రెవిన్యూమంత్రి (శ్రీ కె. వెంకటరావు ) అధ్యక్షా ! నిన్న నేను ఈ బిల్లును ప్రవేశపెడుతూ దానిని select committee కి పంపించవలసినదని కోరియున్నాను Bill కు సంబంధించినటువంటి కొన్ని విషయాలను మనవి చేశాను చెంగల్రాయ నాయుడుగారు మళ్ళీ చెప్పమని అడిగారు కాని, మళ్ళీ పాతకథ అంతా మొదలుపెడితే ఆలస్యం అవుతుంది త్వరగా ఈ Bill ను పూర్తి చేసుకోవలెననే కోరిక మనకున్నది. అయినప్పటికీ; నిన్న చెప్పినదేమిటంటే ఈ నీటిపన్ను - ఈ నీటితీరువ గురించి ఎలాంటి పద్ధతులున్నాయనే విషయం చెప్తూ, నాలుగుపద్ధతులు ఉన్నాయని చెప్పాను ఇంకా విడదీసుకొంటే అవి

ఇంకా ఎక్కువ ఔతాయికూడా. ఎందుచేతనంటే రాష్ట్రాన్నిబట్టి, అక్కడ ఉన్నటువంటి నీటివనరులను బట్టి ఈ పద్ధతులు ఉన్నాయి. నిన్న నేను volumetric system ఉన్నదని చెప్పాను అంటే ఎంతనీరు కొల్చారో ఆ కొలిచినటువంటి నీటికి ఖరీదుయివ్వడం తరువాత consolidated rate కూడా ఉందని చెప్పాను, అంటే నీటిపన్ను, భూమిపన్ను రెండింటిని కలిపివేసే పద్ధతి ఉన్నది Differential పద్ధతిది ఉన్న మెరకపన్నుకి నీటిపన్నుకి మధ్య ఉన్నటువంటి తేడాను నీటిపన్నుక్రింద పుచ్చుకోవడం, మెరకపన్నుకు, నీటి తీరువాకు మధ్య ఉన్నటువంటి తేడాను పన్నుక్రింద పుచ్చుకొనే పద్ధతులు ఉన్నాయని చెప్పారు ఇంకా కొంతమంది agreement వల్ల— Orissa వగైరా ప్రాంతాల్లో—ఇన్ని సంవత్సరములకు నేను నీటిని తీసుకుంటాను. అనే condition మీద నిర్ణయించబడిన రేట్లు ఏవో ఉన్నాయని తమద్వారా మనవిచేశాను వీటన్నింటిలో ఒకచోట మంచీ చెడూ కూడా ఉంటవి ఒక్కొక్కచోట ఒక్కొక్కటీ నడుస్తుంది

ట్యూబ్ వెల్సు వగైరాల కంట్రోల్సు ఉన్నచోట వాల్యూ మెట్రిక్ రేట్ పనికి వస్తుందిగాని ధారాళంగా నీరు ప్రవహించే కాలువలున్నచోట వాల్యూ మెట్రిక్ రేట్ పెట్టడం చాలా కష్టం మన రాష్ట్రంలో ఎక్కువగా అమలులో ఉన్నవి 'Consolidated Wet Rate' అంటే నీటి తీరువ, భూమిశిస్తు కలిపి ఉంటుంది. హైద్రాబాదు రాష్ట్రంలో అదే అమలులో ఉన్నది అది కాకుండా హైద్రాబాదులో ఉన్నపద్ధతికి ఇంకొక ప్రత్యేకత ఉన్నది మిగిలిన చోట్ల భూమిలో ఉన్న సారాన్నిగురించి చర్చించి అక్కడి తరాలను నిర్ణయించాలి ఏ రకమయిన సోర్సులోంచి నీరు తీసుకుంటున్నామో వాటిని కూడా వివరంగా తీసుకుని 'వాల్యూ ఆఫ్ ది సోర్సు' అనే ఇన్యూను ఎక్స్ట్రాగా ఇక్కడ కన్సిడరుచేసి నీటి తీరువా విధించడం జరుగుతోంది 'వాటర్ వాల్యూ', 'క్లాస్ వాల్యూ'లే గాక 'సాయిల్ వాల్యూ' కు రెండింటికి సంబంధించిన పద్ధతి యిదివరకు ఇక్కడ అమలులో ఉన్నది. నేను చెప్పినటువంటి 'కన్సాలుడేటెడ్ వాటరు రేటును' 'డిఫరిన్షియలు వాటరు' రేటుకూడా అమలులో ఉన్నాయి. అక్కడికి, ఇక్కడికి కొంచెం తేడాలున్నాయి. ఆంధ్ర ప్రాంతంలో క్రాప్ వార్ రేటు లేదు ఫలానా పంట వేసుకుంటే దానిప్రకారం పన్ను ఇవ్వాలనే పద్ధతిలేదు. ఇదీ ఉన్న పద్ధతి, యీ పరిస్థితులలో ప్రభుత్వాన్ని నడిపించుకోవాలంటే కొన్ని విధాలుగా నష్టం ఎక్కువవుతోంది. మొట్టమొదటి విషయం, మెయిన్టెనెన్సు కాస్టు చాలా హెచ్చయింది. 1939 వ సం లో మూటికి 40 రూ.లు మెయిన్టెనెన్సు ఖర్చు అయ్యేది. ఇప్పుడు 65 మొదలు

77 రూ॥ల వరకు వివిధ రాష్ట్రాలలో ఖర్చవుతున్నట్లు అంచనాలు వేశారు ఇదికాకుండా గ్రాస్ ఇన్‌కమ్‌లో మొదట 6 రూ॥ల చొప్పున వుచ్చుకొనేది కూడ క్రమేణా హెచ్చవుతున్నది 1919-20 లో 6 రూ॥లు ఉంటే క్రమేపి తగ్గిపోయి 1942-43 లో 4 రూ॥లు అయినది దీనికి ప్రత్యేక కారణమేమీ లేదు ప్రయిసెస్ వేరియేషనువల్ల ప్రపోర్షనుగా పర్సెంటేజి తగ్గుతుంది అందు చేత భారం తగ్గిందనే అర్థం రాదు ఈ విషయంకూడ మనం దృష్టిలో పెట్టుకోవలసిన ఆవశ్యకతున్నది ఇప్పుడు ఆంధ్రదేశంలో ఉన్నటువంటి జనరల్ పొజిషను సభ్యులకు మనవిచేశాను మనకున్నటువంటి ప్రత్యేక ఇరిగ్‌షను చార్జస్ తీసుకుంటే 172 లక్షల రూ॥ల ఆదాయం వస్తుందనుకుంటున్నాము ఇరిగేషన్ రేట్లవల్ల దీంట్లో వర్కింగ్ ఎక్స్‌పెన్సెస్ 79 లక్షలవుతాయి ఇది వరకు 4,507 లక్షల రూ॥లు దీనిమీద పెట్టుబడి పెట్టబడి ఉన్నది దీనిమీద ఇంట్రస్టు ఛార్జస్ ఒకటే 201 లక్ష రూ॥లు ఖర్చవుతోంది అంటే వచ్చే ఆదాయం మెయిన్‌టెనెన్సు ఛార్జస్, ఇంటరెస్టు ఛార్జస్ లెక్క లు వేసుకుంటే ఇవాళ ఉన్న పరిస్థితులలో సంనకు 108 లక్షల రూ॥లు నష్టం వస్తోంది అందు వల్ల ఏరకంగా చూచినప్పటికి కూడా ఇప్పుడు మనం వేసే తీరువా ప్రకారమే మనకు కావలసిన అవసరానవసరాలు ఎలా ఉన్నా పంటకు సరిపోయే ఆదాయం కూడ దీనిర్వారా తెచ్చుకోవడం లేదు కాని ప్రపంచంలో యీ పన్ను విధించడంలో 3 సిద్ధాంతాలున్నాయి "No loss and no profit" వచ్చే ఆదాయం అయ్యే ఖర్చు రెండు సమానంగా చేసుకోవడం. కొంత లాభం లేకపోయినా కొద్దిపాటి నష్టం ఒప్పుకోవడం (సం ప్రోఫిట్ అండ్ నో లాస్) కొంత లాభం అసలు నష్టంలేకుండా చేసుకోవడం ఈ మూడుపద్ధతుల ప్రకారమే యీ వాటర్ రేట్సుగురించి ఆలోచించు కోవలసియుంది పెద్దపెద్ద ప్రాజెక్టులు ఉన్న కృష్ణాగోదావరి మొదలయినచోట్ల ఇదివరకు ఖర్చుచేసినది చాలా తక్కువ కనుక ఇప్పుడు దానిమీద వచ్చే ఆదాయాన్ని లెక్క వేసుకుంటే పర్సెంటేజి ఎక్కువగా కనిపిస్తోంది కాని కొత్తగా సాగులోకి తెచ్చి అసలు పంటలోకి రానట్టిభూములు కొన్నిఉన్నాయి వాటిమీద వేసేపన్నులు ఇప్పుడయే ఖర్చు చూచుకుంటే ఉజ్జాయింపున కొంత నష్టం వస్తుంది. ఈ రెండిటిని కూడ సమానంగా జేయవలసిన బాధ్యత ప్రభుత్వంమీద ఏర్పడిఉన్నది ఈ కొత్తరకంగా పన్నులు వేయడంలో ఏ పద్ధతులు మనం అవలంబించామనేది చాలా ప్రధానసమస్య అసలు పన్నే వేసుకోమంటే ఒకే ఐటంక్రింద 108 లక్షల రూ॥ల నష్టం పెట్టుకుంటు జనరల్ బడ్జటరీ పొజిషనుకు సహాయం చేయకుండా వ్యవహారం సాగించడం కష్టం.

ఇప్పుడు సభముందర ప్రవేశపెట్టబడిన బిల్లు తెలంగాణాలో ఉన్న వాటర్ ఎసెస్‌మెంటు రేట్సు వెట్ ఎసెస్‌మెంటు రేట్సుకు అప్లయికాదు మిగిలిన 11 జిల్లాలలోనే ఇది అమలులోకి వస్తుంది ఈ విషయమును నేను నిన్న మనవి చేశాను వెట్ అసెస్‌మెంటుమీద 18-12-0 చొప్పున వాటర్ రేట్సు నూటికి రూ 25 ల చొప్పున హెచ్చుచేయడానికి యీ బిల్లు సంకల్పించబడింది ఐతే అంతటితో వదలివేస్తే నేను చెప్పిన వ్యవహారమంతాకూడా అలాగే మిగిలి ఉంటుంది అవసరం వచ్చినప్పుడు పన్నులు వేసుకుంటూండడం దీనిని రేషనలైజు చేసి ఏదో ఒకపద్ధతి పెట్టవలసిన ఆవశ్యకత అక్కడా ఇక్కడా ఇంటెగ్రేషను చేయవలసిన అవసరం ఇవన్నీ ఉన్నాయి దీనినిగురించి మనము ఆలోచించవలసి ఉన్నది. 'క్వాంటిటీ ఆఫ్ వాటర్ రేట్స్' ఎంత శిస్తు ఉండాలి ? వాల్యూ ఆఫ్ క్రాప్ గ్రోన్-దానిమీద పంట ఎలాపండుతోంది ? రైతుకు ఎంత ఆదాయం వస్తోంది ? (ఎక్స్‌టెంట్ ఆఫ్ బెనిఫిట్ రియలైజ్డు బై ది కల్టివేటర్) పండించే వారికి ఖర్చులుపోగా ఏవిధమయిన లాభం వస్తోంది ? అన్నిటితోపాటు (ఎబిలిటీ ఆఫ్ ది కల్టివేటర్ టు పే) పన్ను ఇచ్చే శక్తిసామర్థ్యాలు ఎలావున్నాయి ? ఆనే విషయంకూడా ఆలోచించాలి నీటి తీరువలో సర్వీస్ రేటు కాకుండా నీకు ఇంతనీరు ఇచ్చాముకనుక నీకు చేసినసేవకు ఇంత ఖర్చయింది అని నిర్ణయించడమే కాకుండా ఎలిమెంట్ ఆఫ్ టాక్స్ కూడా దీనిక్రిందకు తీసుకొస్తున్నాము సర్వీసు పెట్టుబడికి సరిపోయినట్లేకాకుండా ఎక్కువ పన్ను పుచ్చుకునేందుకు ప్రపోజల్సుఉన్నాయి కనుక ఎలిమెంటు ఆఫ్ టాక్సు రేటుకూడా దీనిలో ఉన్నది. దీనిని టాక్సేషను ఎంక్వయిరీ కమిటీవారు ఇదివరకే ఆమోదించారు. ఇరిగేషనుపోగ్రెస్‌లో ఉన్న తేడాలను ఇరిగేషను రేట్సుతో కూడా స్పష్టంగా నేను చెప్పిన షరతులమీద తీసుకురావలసిన ధర్మం ఉన్నదని మనం గుర్తించక తప్పదు ఇతరదేశాల్లో కూడా యీ భావాలున్నాయి. ఆస్ట్రేలియాలో కొత్తగా ఒక ప్రాజెక్టు మొదలుపెడితే మొదటి సంవత్సరము పన్నేమీ పుచ్చుకోకుండా ఊరుకుంటారు రెండవ సంవత్సరము నాలుగవవంతు పన్ను పుచ్చుకుంటారు. మూడవ సంవత్సరము సగము పుచ్చుకుంటారు నాలుగవ సంవత్సరంలో ¾ పుచ్చుకుంటారు. ఆ విధంగా ఉంటుంది. ఇటలీలో కూడా మొదటి మూడు సంవత్సరముల పాటు పన్ను వసూలుచేయడం జరగడంలేదు. ఈ విషయాలన్నీ కూడా క్రోడీకరించి సమగ్రంగా దీని మీద అభిరుచిఉన్నవారి ద్వారా గాఢమయిన విచారణచేయించి ఒక స్థిర రూపం కల్పించిన న్యాయంగా ఉంటుందని ప్రభుత్వం గుర్తిస్తోంది. అందువల్ల రెండు భాగాలుగా యోచించవలసిఉన్నది ఒక ప్రక్కన ఇవాళ మన

అవసరానవసరాలను బట్టి, బడ్జట్ పొజిషనునుబట్టి, దీనిలో వచ్చే నష్టాన్ని గుర్తించుకుని మాత్రమే యీ బిల్లు తమ ముందకు వచ్చింది దీని విషయమై సమగ్రమయిన విచారణ సలిపి దీనిలో ఉన్న నిగ్గుతీసి బిల్లులో ఏపద్ధతిని—వాటర్ రేటా? వాటర్ అసెస్‌మెంటా? డిఫరెన్షియల్ వాటర్ రేటా? కన్‌సాలిడేటేడ్ వెట్ రేటా? ఇన్ని భాగాలుగా నేను చెప్పిన మార్గాలన్నింటిని ఏవిధంగా ఎక్కడ ఏ రిసోర్సెస్ నుంచి నిర్ణయించాలి అనే విషయం మాత్రం సక్రమమైన విచారణ జరపడం కోసం ప్రభుత్వంవారు ఒక కమిటీని నియమించడానికి నిర్ణయించారని మనవిచేస్తున్నాను ఇవ్వాళ ఉన్న పరిస్థితులను బట్టి ఇప్పుడు వేసే పన్ను అత్యధికమైనది కాదు నేను ఎవరిమీద చెప్పడం భావ్యంకాదు కనుక నామీదే చెప్పుకుంటున్నాను నా స్వంత పొలంలో నా చిన్నతనంలో ఎకరానికి 8 బస్తాల కౌలు ఇచ్చారు ఇదివరకు పరిస్థితి స్ఫురింపచేయుటకు కౌలువిషయం చెబుతున్నాను నాకు కొంచెం వయస్సు వచ్చినతరువాత పది బస్తాలు కౌలుకు ఇచ్చారు ఈనాడు దానిమీద పంట బాగా పెరిగింది సగటున 20 బస్తాలు పండుతోంది. అందుచేత ఇవాళ 13, 14 బస్తాలు ఇవ్వడానికి సిద్ధంగా ఉన్నారు ఐతే ఇప్పుడు అలా ఇవ్వడంలేదనుకోండి అందరికి వర్తించేదే నాకూ వర్తిస్తుంది కనుక వ్యవసాయం మా మేనల్లుడిచేత చేయించుకోవలసి వస్తోంది ఇది ఇప్పుడు దీనిని 'కన్‌సిడరేషను' లోకి తీసుకుని దాంట్లో ఒకభాగమయినా పన్ను క్రింద ఇచ్చుకోవాలి

గోదావరి ప్రాజెక్టు 4 ఆనకట్టలకు 90 లక్షల 32 వేలు ఖర్చుఅయినది దానిమీద లెక్కకట్టితే ఈ వేసేపన్ను హెచ్చుగా కనిపిస్తుంటుంది కాని, వచ్చిన లాభాలు కూడ గుర్తులో పెట్టుకొని, దీనిని పైకి తీసుకువెళ్లక తప్పదు ఇప్పుడు లెక్కచూస్తే క్రిందటి ఏడు పన్ను, ఈ సంవత్సరం పన్ను, యింకా ఈనాములను రైత్వారీ రేటు వేసినది—యివి అన్నీ లెక్కవేసుకుంటే కొంచెం హెచ్చు తగ్గుగా, ఎకరానికి పండే పంటలో ఒక బస్తా ధాన్యాన్ని కూడ పన్ను క్రింద యివ్వటంలేదు అందువల్ల దీనినిఆధారంగా ఆలోచించి దేశంయొక్క ఉపయోగానికి వినియోగపడేటట్లు, త్యాగరూపంలోనైనా వ్యవహారం చేయాలి ఒకవైపు సర్వీసురేటు, ఒకవైపు టాక్సురేటు ఈ రెండూ సమన్వయం చేసుకొని స్థిరంగా చేయటానికి మనము ఆలోచిస్తున్నాము కనుక, యివాళ బడ్జెటు పొజిషన్ చూచినప్పటికీ యీ డెఫిసిట్ తగ్గించటానికి, యింకా ఎక్కువ పెట్టుబడి పెట్టి ఇర్రిగేషన్ పనులు కొనసాగిస్తున్నాము కనుక దానిమీద అధిక నష్టము రాకుండా ఈ 102 లక్షలు కూడ దీసుకొనటం ఎలాఉన్నా, ఈ నష్టం పెరగకుండా చేసుకొనుటకయినా, యీ పన్నులు వేయకపోతే జరగదు. ఇవాళఉండే

ధరవరలను బట్టి, దేశంలోని పరిస్థితులను బట్టి, ప్రభుత్వ పరిపాలనావసరాలను గుర్తించి, ఈ విధంగా చేయవలసివచ్చినది ఈ బిల్లును త్వరలో ఏకగ్రీవంగా ఆమోదించవలెనని నేను సభవారిని కోరుతున్నాను.

శ్రీ పిల్లలమర్రి వెంకటేశ్వర్లు (నందిగామ) On a point of order, Sir, ఈ బిల్లును public opinion కు పంపవలెనని ఒక అమెండ్‌మెంట్ ఉన్నది దానిమీద ముందు మాట్లాడాలి తరువాత ప్రతిపక్షం తరఫున debate ను ప్రారంభించుటకు అవకాశం ఉండాలి.

శ్రీ పి. నరసింహప్పారావు (పాలకొండ) · అధ్యక్షా, అపోజిషన్ తరఫునే నేను మాట్లాడుతున్నాను నేషనలిస్ట్ పార్టీ కూడ అపోజిషన్ పార్టీ ఇప్పుడు రెవిన్యూ మంత్రిగారు తెచ్చిన బిల్లు, రాబోయే బిల్సును, పూర్తిగా వ్యతిరేకించి మాట్లాడుతున్నాను వారు యిచ్చే లెక్కలు, చేసే ఉపన్యాసాలు చాలా రుచిగా ఉన్నట్లు ఉంటాయి వారికి జవాబు చెప్పలేము ఆల్ ఇండియా లెక్కలు వారి కుక్షిలో ఉన్నవి ఏ గంటలో చెప్పమంటే ఆ గంటలో చెప్పి సమర్థించగలరు కాని పన్నులు వేయుటకు ఒక్క రైతే కనిపిస్తున్నాడా? ఇంకెవరూ లేరా? పన్నులువేసి ఒక సంవత్సరం కావటంలేదు, ఇదివరకు వేసిన పన్నులు వసూలుకావటంలేదు మళ్ళీ కొత్తగా నూటికి 37½ వరకు పన్నులు వేస్తున్నారు రైతుకు భారం అవుతున్నది. మళ్ళీ ఈ పన్నులు వేయుటకు ఎంతమాత్రం వీలులేదని తమద్వారా మనవిచేస్తున్నాను

మిస్టర్ స్పీకర్ అందువల్ల సెలెక్టు కమిటీకి పంపుటకు కూడా తాము వ్యతిరేకులు.

*శ్రీ పి. నరసింహప్పారావు సెలెక్టు కమిటీకి పంపవద్దని, ఈ పన్నులు వేయవద్దని నా మనవి. ఆంధ్రప్రదేశ్ వచ్చింది, చల్లగా ఉంటామనే ఉద్దేశంతో ఉన్నారు చీఫ్ మినిస్టరుగారికి లేకపోయినా ఈ విధంగనైనా లాభం తీసుకు వద్దామని మంత్రిగారు యీ బిల్లును తీసుకువచ్చి పెట్టారు మా ఉద్దేశం, మళ్ళీ రైతులమీద పన్నులు వేయకుండా యింకొక విధంగా రాబడి తేవచ్చును. డబ్బు లేకపోతే పనులు కావని తెలుసు. ఆదాయం ఎక్కువ చేయవలసిన అవసరంఉన్నది. ప్రొహిబిషన్ ప్రవేశపెట్టి 20 సంవత్సరములైనది 1937 లో మద్రాసులో ఉండగా, ప్రవేశపెట్టారు ఇది నిరుపయోగంగా కనిపిస్తున్నది. హోంమంత్రిగారు గుంటూరు వచ్చినప్పుడు చెప్పారు - అయిదేళ్ళు తెలంగాణాలో ఉంటుందని, ఈ experiment చూచి ఆంధ్రలో తెస్తామని చెప్పారు.

అయిదేళ్ళు తెలంగాణాలో సంవత్సరానికి అయిదారు కోట్ల రూపాయలరాబడి దీనివలన వచ్చేది ఖర్చు పెట్టుకుంటూ, ఆంధ్రలో యీ అయిదారుకోట్ల రాబడి వదిలి పెట్టుకుంటూ అయిదేళ్ళు అయిన తరువాత తెస్తామంటే ఎట్లా పనులు అవుతాయి ? ప్రొహిబిషన్ fail అయినది అమెరికాలో, యితర దేశాలలో కూడ fail అయినది దానిమీద వచ్చే రాబడి మనకు పోతున్నది ఆ రాబడి ఉంటే మనం ఎన్ని పనులైనా చేసుకొనవచ్చును ఆ రాబడిని నీటిపారుదల సౌకర్యాలకు, N E S Blocks, యింకా యితర పనులకు ఖర్చు పెట్టుకొన వచ్చును ఆ ప్రకారం చేయవలసినదని మంత్రిగారికి మనవి చేస్తున్నాను ఆంధ్ర ప్రదేశ్ వచ్చిన తరువాత చాలా వ్యతిరేకపార్టీలు వచ్చినవి ఎఱ్ఱతేళ్లు, నల్ల తేళ్ళుకొన్ని వచ్చినవి వారంతా వ్యతిరేకంగా గవర్నమెంటు మీద Propaganda చేస్తున్నారు రైతులమీద ఎక్కువ పన్నులు వేయుటవల్ల పరపతి తగ్గి పోతున్నదని మనవిచేస్తున్నాను ఏ పన్ను వేయాలన్నా రైతే కనిపిస్తున్నాడు చెరువులకు మరమ్మతులు లేవు నీరు యివ్వడానికి పన్ను ఏమిటి ? నాలుగు వేలు రాబడివచ్చే లాయరుకు ఏమి పన్ను వేస్తున్నారు ? నాలుగు వేలలోపు రాబడివుంటే, ఆయనకు పన్ను లేదు వారికి పన్ను వేయటానికి ఒక పరిమితి పెట్టారు అట్లాగే రైతుకు కూడా ఒకపరిమితి పెట్టాలి 10 ఎకరాలు, 20 ఎకరాలు లోపువానికి పన్ను లేకుండా రైతుకు కూడ పరిమితి పెట్టాలని మనవి చేస్తున్నాను. వందల ఎకరాలు ఉన్నవారికి ఎక్కువ పన్ను వేయండి, యీ ప్రొహిబిషన్ fail అయిపోయింది కనుక అది తీసివేస్తే ఏడెనిమిది కోట్ల రూపాయల ఆదాయం వస్తుంది. ప్రొహిబిషన్ డిపార్టుమెంటులో లంచగొండితనం అతీతమైపోతున్నది ఏ తాలూకాలో చూచినా ప్రొహిబిషన్ సబ్-ఇన్స్పెక్టర్ నాలుగువేలు సంపాయిస్తున్నాడు అదంతా గవర్న మెంటుకు రాదు పైవారు తింటున్నారు లక్షలకొలది సంపాయిస్తున్నారు ఆంధ్రలో ప్రొహిబిషన్ ఉన్నది ఇటు తెలంగాణాలో లేదు. ఆ డబ్బు తీసుకువచ్చి తెలంగాణాలో ఖర్చుపెట్టుతున్నారు ఆ డబ్బు ఆంధ్రలో ఖర్చు పెట్టండి అయిదు సంవత్సరాలైన తరువాత exclude చేస్తామన్నారు, అది వీల్లేదు ఇద్దరమూ సోదరులవంటి వారమే ఆంధ్రప్రదేశ్, తెలంగాణా రెండూ ఒకటే ఆంధ్రలోకూడ దీనిమీద ఏడుకోట్ల ఆదాయం వస్తుంది ఇప్పుడు మళ్ళీ యీ పన్నులు వేయటానికి వీలులేదు ప్రజలు మమ్ము లను అడుగుతున్నారు- "అసెంబ్లీలో ఉఁకొట్టి చేతులు ఎత్తుతున్నారు, మాకు ఏమిచేస్తున్నారు ?" అని అడుగుతున్నారు. దీనిమీద రిజైన్ చేసి బయటకు వెళ్ళా మంటే, ఎలెక్షన్సులో ఎవరమూ succeed కాలేము అని చెపుతున్నాను రైతులు

కాకుండా యింకెవరూ రాబడివచ్చే వారులేరా? డబ్బు ఉన్నవారు ఉన్నారు, వడ్డీకి యిచ్చేవారు, Bankers ఉన్నారు ఎప్పుడుచూచినా రైతే కనిపిస్తున్నాడు. కర్నూలులో ఉన్నప్పుడు కూడ రైతుమీదే పన్నువేశాము రూపాయకు అర్ధరూపాయి వేశాము ఇప్పుడు మళ్ళీ 37½ వేయటానికి చూస్తున్నాము వాణిజ్య పంటల మీద పన్ను వేస్తామంటున్నారు ఈ రోజున గ్రామాలలో జరుగుతున్న దేమిటి? రెవిన్యూఇన్స్‌పెక్టరు మొదలు కరణం వరకు ప్రతి ఉద్యోగస్థుడు ఇష్టంవచ్చినట్లు కాకుల లెక్కలువ్రాస్తారు "మీకు మేము లెక్కలువాస్తున్నాము మాకే మిస్తావు" అని అడుగుతారు డబ్బుఇచ్చామంటే, పండినపంట పండలేదని వ్రాస్తారు డబ్బు ఇవ్వకపోతే పండని పంట పండిందని వ్రాస్తారు ఇప్పుడు పన్నులు ఎక్కువ వేయటం వల్ల ఉద్యోగస్థులు బాగుపడతారు తప్ప ప్రభుత్వానికి వచ్చే డబ్బు ఉండదు ఈ విధంగా ప్రభుత్వం మరింత లంచగొండితనాన్ని పెంచుతున్నారని మనవిచేస్తున్నాను అందువల్ల యీపన్నులను విధించకూడదని మనవిచేస్తూ ముగిస్తున్నాను

మిస్టర్ స్పీకర్ శ్రీ వావిలాల గోపాలకృష్ణయ్యగారి అమెండుమెంటు ఉన్నది ఈ బిల్లును సెలక్టుకమిటీకి పంపించకుండా, పబ్లిక్ ఒపీనియన్‌కు సర్క్యులేట్ చేయవలసింది అని వారి అమెండ్‌మెంటు ఉన్నది సభ్యులు వారి అమెండ్‌మెంట్ మూవ్ చేయవలసింది.

***Sri Vavilala Gopalakrishnayya (Sattenapalli)*** **I beg to move 'That the Bill be circulated for the purpose of eliciting public opinion'** అనే నా అమెండుమెంటు మూవ్ చేస్తున్నాను మనకు విశాలాంధ్ర వచ్చిన కొత్తలో మన ముఖ్యమంత్రిగారు షాద్‌నగర్ లోను, కర్నూలులోను మాట్లాడుతూ, "ఇప్పటికే రైతాంగం పన్నులభారంతో కృంగిపోతున్నారు, వారిపైన అదనంగా పన్ను వేయటానికి వీలులేదు" అనిచెప్పారు

ఆర్థికమంత్రి (డాక్టర్ బి. గోపాలరెడ్డి) . వీలులేదు అని అన్నారా?

శ్రీ యన్. సంజీవరెడ్డి . ఎక్కడో, ఒక సంవత్సరంక్రిందట మాట్లాడినట్లు పత్రికలలో చదువుకొని, ఇక్కడ కోట్‌చేయటం, దానిని మేము ఇక్కడ కాంట్రడిక్ట్‌చేయటం మామూలై పోయింది. ఎప్పుడూ ఇదేనా? వారు ఉపన్యాసం ఏదో చెప్పవచ్చు. వన్ ఇయర్ వోల్డ్‌వి పట్టుకొని చెప్పేదానికన్నా, ఉన్న ఫాక్ట్స్ చెప్పొచ్చుగా. ఒక సంవత్సరం క్రితమువి ఇక్కడ కోట్‌చేయటం, మేము కాంట్రడిక్టు చేయటం, ఎప్పుడూ ఇదేనా?

శ్రీ వావిలాల గోపాలకృష్ణయ్య 'One year old' వి అంటే policies కూడా 'one year old' వే కాని, అవి ఇప్పుడు అమలుజరుపుతున్నారు. ఫేక్ట్సు కూడా వన్ ఇయర్ వోల్డ్‌వే కాని అవే ఇప్పుడు అమలుజరుపుతున్నారు అందువల్ల నేను మొట్టమొదటి నుంచి ఫేక్ట్సు అన్నీ చెప్పేబదులు పన్నులభారం వహించే స్థితిలో ప్రజానీకంలేదని చెబుతున్నాను

*Sri N Sanjeeva Reddi* I have no objection with what he says Let the hon Member go on in his own way I will take it with a pinch of salt

మిస్టర్ స్పీకర్ మీ దగ్గర అందుకు సంబంధించిన కాగితం ఉంటే, అది టేబుల్ మీద పెట్టండి ఒక సంవత్సరం క్రితం ఏమి జరిగిందో తెలియదు. కాబట్టి మీ స్వంత అభిప్రాయాలు చెప్పండి

శ్రీ వావిలాల గోపాలకృష్ణయ్య మన రెవిన్యూమంత్రిగారు యీ బిల్లు తేవటానికి కొన్ని ప్రధానమైన కారణాలు చెప్పారు అందులో మొదటిది — మన రెవిన్యూలో లోటు వస్తోంది కాబట్టి, ఆ లోటును పూర్తిచేసుకోవాలి రెండవది ఇప్పుడు నాలుగు రకాల నీటి తీరువా పద్ధతులున్నాయి, ఆ నీటి తీరువా పద్ధతులన్నీ మార్పు చేసుకోవలసిన అవసరం ఉంది. మూడవది ఖర్చులు ఎక్కువ అవుతున్నాయి కాబట్టి ఆదాయాన్ని పెంచుకోవలసి ఉన్నది నాలుగవ కారణం ఏమిటంటే, అక్కడ పెట్టిన ఖర్చులను తిరిగి రాబట్టుకోవాలని

కృష్ణా గోదావరి డెల్టాలలో ఎంత డబ్బు ఖర్చు పెట్టబడిందో, అంత డబ్బు ఇదివరకే ప్రభుత్వం వసూలు చేసుకొన్నది అందువల్ల ఆ ఖర్చులు వసూలు చేస్తున్నాము అన్నది సరైందికాదు. ఇవాళ పన్నుల విధానంలో చాలా తికమకలు ఉన్నాయి లాండ్ రెవిన్యూ విషయంలో, నీటి తీరువా విషయంలో అన్ని విషయాలు సమగ్రంగా ఆలోచించటానికి ఒక కమిటీని వేయబోతున్నామని మంత్రిగారు అన్నారు ప్రభుత్వంవారే యీ పన్నుల విధానం అసమగ్రంగా ఉన్నదని భావిస్తున్నారు. దాంట్లోనే తిరిగి దొంతరలు కట్టేబదులు, మొత్తంగా, సమగ్రంగా విచారణచేసి పన్నులు వేసే విధానం ఆలోచిస్తే బాగుంటుంది కనుక ఒక కమిటీవేసి, ఆ కమిటీ నివేదిక వచ్చిన తర్వాత వారు ఏ సిద్ధాంతాలమీద ఆలోచన చేయమంటారో చూసి, అప్పుడు ప్రజాభిప్రాయం ప్రకారంగా చేయటానికి వీలుంటుంది కనుక, ప్రస్తుతానికి యీ పన్నులు వేయటాన్ని ఆపువేయవలసిందిగా కోరుతున్నాను మనము ప్రోగ్రెసివ్

టాక్సేషన్ కావాలని చెబుతున్నాము ప్రోగ్రెసివ్ టాక్సేషన్ కావాలని చెప్పేటప్పుడు, ప్రతివాడిమీద పన్నులు వేయడమేనా ? ఇవాళ 162 విధానాలుగా పన్నుల విధానం ఉన్నదని రాఘవేంద్రరావుగారు తన నివేదికలో చెప్పారు వాటిని ముట్టుకోటానికి వీలులేదని అవి అట్లాగే ఉండాలని చెప్పారు కాని వాటిని మార్చవలసిన అవసరం ఉంటుందని, అందుకు ప్రయత్నం చేయ బడుతుందని ప్రభుత్వం చెబుతున్నందుకు అభినందిస్తున్నాను ఉన్నటువంటి పన్నుల విధానాన్ని మార్చవలసిన అవసరం ఉన్నది పన్నుల విధానం దేనిమీద ఆధారపడి ఉన్నది ? పన్నుల భారం సామాన్య ప్రజలమీద పడకుండా, ఎక్కువ ఆదాయం వస్తున్నవారినుండే పన్నులు వసూలుచేసే పద్ధతి రావాలి దానికి టాక్సేషన్ కమీషన్ చాలా గట్టిగానే చెప్పింది "మీరు అగ్రికల్చరల్ ఇన్‌కమ్ మీద పన్నువేసే ప్రయత్నం చేయాలి" అని చెప్పారు కాని ప్రభుత్వం అగ్రికల్చరల్ ఇన్‌కమ్‌టాక్స్ బిల్లును తేదలచుకోనట్లు మనకు తెలుస్తున్నది ఉన్న పన్నునే వదలిపెట్టాలని అనుకొంటున్నట్లు తెలుస్తున్నది ఎగ్రికెల్చరల్ ఇన్‌కంకు సంబంధించిన లెక్కలే మనదగ్గర లేవు నిజాం సుగర్ ఫ్యాక్టరీవారు 8 లక్షలు ఇస్తున్నారంటే, దాంట్లో సగంకూడా ఎకౌంట్ కాలేదని వీరు చెబుతున్నారు దానికి నేను వేరే ప్రశ్న వేశాను దానికి జవాబు తర్వాత వస్తుందనుకొంటాను మొత్తంమీద ఆదాయవిధానం సరిగా లేదని తెలుస్తుంది వాటర్ రేటు మీద మొన్ననే పన్ను వేశారు తిరిగి ఇవాళ దానిని పెంచు తున్నారు "ఇదివరకు దానిని జి. ఓ. ప్రకారం పెంచాము. ఇప్పుడు దానిని శాసనం ప్రకారంగా పెంచుతున్నాము" అని చెబుతున్నారు ఆ రోజున కూడ, దానిని ప్రజాభిప్రాయానికి ప్రకటించాలని ఉన్నది

"A rule of notification prescribing water-rates under the Act has been published for eliciting opinion before it is finalised "

ఇది ప్రతిదానికీ అవలంబించే పద్ధతి జి ఓ. మార్చటానికి ప్రయత్నించి నపుడే పబ్లిక్ ఒపీనియన్ అడగాల్సిన స్థితి ఉన్నప్పుడు, లెజిస్లేషన్ చేసేటప్పుడు పబ్లిక్ ఒపీనియన్ తప్పకుండా అడగాల్సిన అవసరం ఉన్నది కాబట్టి టాక్సేషన్ విషయంలో మనం ప్రధానంగా ఒకటి ఆలోచించవలసింది ఉన్నది పన్ను ఎవరి మీద వేస్తున్నారు ? ఎక్కువ ఆదాయం వచ్చేవవారిమీద పన్ను వేస్తున్నారా ? లేదు. సామాన్యమైనటువంటి ఆదాయం వస్తున్నవారిమీద పన్ను వేస్తున్నారు మేము ఎప్పుడూ టాక్సేషన్‌కు వ్యతిరేకంకాదు. సామాన్య ప్రజానీకంమీదపన్ను వేయాలనే ప్రయత్నం వృధైతేఉన్నచో, దానిని ఎల్లప్పుడు మా శక్తి ఉన్నంత కాలం ప్రతిఘటించక తప్పదు. ఎవరెవరిమీద పన్ను వేస్తే బాగుంటుందో ఆలో

చించాలి వ్యవసాయ ఆదాయం తీసుకోండి ఆదాయం ఎవరికి ఎక్కువవస్తే వారిమీద పన్ను వేయండి ఇప్పుడు ప్రభుత్వం వేసే పన్ను ఒక ఎకరంమీద, అర ఎకరం మీద, చివరకు పావు సెంటుమీద కూడ పడుతుందని అందరికీ తెలుసు ఈ సంగతి ప్రభుత్వానికి కూడా తెలుసు పదో పది ఎకరాలకనో, ఇరవై ఎకరాలకనో, లేక 30, 40 రూపాయల భూమి శిస్తుకనో ఒక పరిమితి పెట్టి, ఆ భూమి మీద పన్ను వేయవద్దు అంతకుపైన ఉన్న భూమిమీద తర తమాల భేదంతో పన్ను వేస్తామని చెప్పండి దానికి మంత్రిగారు ఒక సంగతి చెప్పవచ్చు "మేము సర్చార్జి వేయబోతున్నాము" అని వారు చెప్పవచ్చు బేసికల్ థింగ్స్‌ను మార్చకుండా, ఉన్నటువంటి ప్రాతిపదికమీద ఆధారపడి సర్చార్జి పెంచటం తప్ప రెండోది కాదిది అందుచేత రిగ్రసెవ్ టాక్సేషన్‌మీద ప్రోగ్రెసివ్ టాక్సేషన్ వేయటానికి ప్రయత్నించటమే గాని, అసలు బేసిక్‌గా ప్రోగ్రెసివ్ టాక్సేషన్‌కు వెళ్ళటంలేదు. ఇదివరకు ఉన్న ఎగ్రికల్చరల్ ఆదాయానికి, ఇప్పుడుగల ఎగ్రికల్చరల్ ఆదాయానికి ఎంతో తేడా ఉన్నది ఆనాడు లెక్కలుచూస్తే, ఆంధ్రరాష్ట్రంలో ఎగ్రికల్చరల్ ఆదాయం నాలుగుకోట్లకన్నా ఎక్కువలేదు కాని యీనాడు లెక్కలు చూస్తే, ప్రొడక్షను అంతా కలిస్తే ఆంధ్రరాష్ట్రంలో ఎగ్రికల్చరల్ ఇన్‌కం 300 కోట్ల రూపాయలు వస్తున్నట్లు తెలుస్తోంది ఆంధ్రప్రాంతంలో 300 కోట్ల రూపాయలు కలిగినటువంటి ఎగ్రికల్చరల్ ప్రొడక్షను ఉన్నప్పుడు, ఆ ప్రొడక్షను మొత్తంమీద పన్ను వేయ టానికి వీలులేదు తక్కువ ఆదాయం వచ్చేవారిని వదిలేస్తే, అందుకుగాను, 200 కోట్ల రూపాయల ఖరీదుచేసే ఎగ్రికల్చరల్ ప్రొడక్షను మినహాయించి నప్పటికీ ఇంకా 100 కోట్ల రూపాయల ఖరీదుచేసే ఎగ్రికల్చరల్ ప్రొడ్యూస్ ఉంటుంది ఆ విధంగా పెద్ద రైతుల పైన 5 పర్సెంటు, 10 పర్సెంటు, 20 పర్సెంటు చొప్పున ఎగ్రికల్చరల్ ప్రొడ్యూస్ మీద పన్ను వేస్తే బాగుంటుందని చెబుతున్నాను

తిరువాన్కూరు కొచ్చిన్‌లో ఒక విధానమున్నది అక్కడ వారిలెక్క ఎట్లా ఉన్నదంటే, ఒక్కొక్క ఎకరానికి ఒక పాతపైసా చొప్పున లెక్కకట్టి వసూలుచేస్తారు ఈ పద్ధతి పురాతనమునుంచి ఉన్నది ఆ పద్ధతిలో పన్ను వేయ టానికి ఆలోచిస్తే బాగాఉంటుందేమో కాని, అది వేస్తేకూడ క్రిందివారిని మినహాయించకుండ చేసే విషయములో లాభములేదు. ఇలాంటి విధానం కంటె, అన్నింటికంటె చక్కటి కొత్తపద్ధతిలోనికి యీలాండు రెవిన్యూసిస్టము మార్చవలసిన అవసరము ఉన్నది. ఎప్పుడో ప్రభుత్వము చేసిన దానిమీద ఆధారపడి, పూర్వపుపద్ధతిలో ఒక్కొక్కరికి ఎంత extent ఉన్నదో, దానిమీదనే

పన్ను వేస్తున్నారు ఆ extent మీద చేసేటప్పుడు కూడ ఒకపని చేశారు తరతమములవారీగా తరములు నిర్ణయించారు ఆతరములలో కూడ మార్పులు చేశారు ఒక్కొక్క లెక్క వేస్తే ఒక్కొక్క తరం క్రింద విభాగాలు పదివున్నవి అన్నీ వేస్తే ఆ 160 సిస్టమ్సు వస్తున్నవి కనుక ఈ 160 systems యీ రోజున అమలు జరుపుతున్నారా ? భూమిలో మార్పులు వచ్చినవిగదా ! అవి వచ్చినప్పుడు దాన్ని resettlement చేసేటప్పుడు ఏమిచేశారు ? Resettlement చెశారుకదా ! 1930వ సం॥ లో గోదావరి కృష్ణాజిల్లాలలో resettlement జరిగింది ఆ resettlement లో ప్రభుత్వం పన్నులు ఎక్కువ చేయాలని ఆలోచించింది అప్పుడు జాతీయ ఉద్యమము దాన్ని ప్రతిఘటించింది ఆ సందర్భములో కొందరు జైళ్ళకుకూడ వెళ్ళారు వారు చివరకు రూపాయకు మూడుఅణాల చొప్పున మాగాణికినీ, రెండుఅణాలు చొప్పున మెట్టకును వేయాలని ఆ ఆలోచించారు ఆ ఆలోచన అమలు జరుపుతూఉంటే మరల దేశీయ ఉద్యమము ఫలితముగా దాన్ని abeyance లో పెట్టారు అటుతరువాత మార్జోరి బాంక్స్, ఆ సమయములో Revenue Board Member గా ఉన్నాడు అప్పుడు యీ విషయము పరిశీలించి రిపోర్టు పంపటానికి ఆయన Chairmanship క్రింద ఒక కమిటీని వేశారు అప్పుడు ఆ కమిటీ "వేసినటువంటి enhancement ను మాత్రము అపుచేయవలెనని" నిర్ణయించారు ఆ సమయములో, కాంగ్రెసు అధికారములోనికి రాబోయేముందు, Interim-Government అధికారములో ఉన్నది. ఆ Interim Government లో ఉన్న కీ॥ శే॥ సర్. కె వి రెడ్డి నాయుడుగారి మంత్రివర్గం 'యీ కమిటీవారి నిర్ణయము ఆమోదిస్తున్నాము పెట్టిన పన్ను రద్దుచేస్తా'మని క్రొత్తగా రీసెటిల్ మెంటు, అసలు రీసెటిల్ మెంటు విధానం రద్దుచేశారు అయితే ఆనాటి పరిస్థితులకున్ను, యీనాటి పరిస్థితులకున్ను తేడాలేకుండా ఒకే విధముగా ఉన్నవా అని అడగవచ్చును నిజమే, లేదని నేను ఒప్పుకుంటాను ఎందుకంటే, మనము యీనాడు planning అమలు జరుపుకుంటున్నాము దీనివల్ల ప్రభుత్వానికి ఖర్చులు ఎక్కువ అవుతున్నమాట నిజమే ఈ ఖర్చు ఎందువల్ల ఎక్కువ అవుతున్నది ? అచ్చంగా production cost వల్ల ఎక్కువ అవుతున్నదంటారా ? production cost అప్పటికంటే యిప్పుడు ఎక్కువ పెరిగితే దానినిబట్టి ఎందువల్ల పన్ను తీసుకోవడములేదు ? Production చూచుకున్నప్పుడు, production charges కూడ ఎక్కువ అవుతున్నవి అన్నారు. Production charges ఎందువల్ల, ఎవరికి ఎక్కువ అవుతున్నవి ? ఒక్కొక్కరికి రెండువందల ఎకరాలు, మూడువందల ఎకరాలు యీ మాదిరిగ ఎక్కువగ

భూమిగలవారు ఉంటున్నారు ఆ పెద్ద భూస్వామికూడ నాకు production charges ఎక్కువ అయినవి అంటున్నాడు ఇక రెండు ఎకరాలు, మూడు ఎకరాలు, నాలుగు, అయిదు ఎకరాలు యీ మాదిరిగ కొద్దిగాఉన్న ఆసామికూడ production charges ఎక్కువ అవుతున్నవని అంటున్నాడు అయితే రెండు, మూడు, నాలుగు, అయిదు ఎకరాలకు అయ్యే charges కున్నూ, నూరుఎకరాలకు అయ్యే charges కున్నూ తేడాఉన్నది ఎందుకంటే, surplus ఆదాయము ఉండే అవకాశము నూరుఎకరాలవాడికి ఉన్నది కాని రెండు, మూడు, నాలుగు అయిదుఎకరాలవాడికి surplyus ఆదాయము ఉండే అవకాశము లేదు పైగా అతనికి కష్టము ఎక్కువగ ఉంటుంది కాని ప్రయోజనము చూస్తే చాలా తక్కువే మన రెవిన్యూమంత్రి గారు చెప్పినట్లుగా ఒకవేళ యీ రెండునుంచి అయిదు ఎకరాలమీద ఒక్కొక్క గ్రామములో ఎకరానికి పూర్వము ఎనిమిది బస్తాలకంటె వచ్చేదిగాదు ఈనాడు 15, 20 బస్తాలు వస్తున్నప్పటికినీ, అది లెక్క వేసుకుంటే, ఆయన కుటుంబఖర్చులు అన్నీ లెక్కలోనికి తీసుకుంటే, వచ్చే ఆదాయము దానికి సరిపోతుంది అంటారు ఇక నూరు ఎకరాలవ్వాడికి కుటుంబఖర్చులు పోను మిగిలే అవకాశము ఉన్నది అందువల్ల, పదిఎకరాలైనా, అయిదు ఎకరాలైనా, యిన్ని ఎకరాలమీద పన్ను ఉండదు అని ఒక limit పెట్టి ప్రభుత్వము చెప్పేటట్లయితే అంతకు ఎక్కువ ఎకరాలున్నవారి వద్దనుంచి, రేటు హెచ్చుచేసి, వసూలుచేస్తే యీ సొమ్ము వారివద్దనుంచి రాగలదు, చిన్న ఆసాములు అందరు ప్రభుత్వము వెంటఉండి, పన్ను వసూలుకు తోడ్పడే అవకాశము ఉన్నది అలా గాకుండ చిన్నవాడిని పెద్దవాడిని అందరినీ కలిపి వసూలు చేయటానికి ఆరంభిస్తే, పెద్ద వాడు తప్పులెక్కలు చూపించి తప్పించుకోటానికి వీలుఅవుతుంది చిన్నవాడు తప్పించుకోలేని పరిస్థితిలో ఉంటాడు అసలే ఆధాయము చాలీచాలని పరిస్థితిలో పన్నులభారము కూడ మీదపడుతుంది అందువల్ల యీ taxation మార్చవలసిన అవసరము ఉన్నది అసలు ఈ taxation విధానమే మార్చవలసిన అగత్యము ప్రస్తుత పరిస్థితులలో ఎంతైనా ఉన్నది ఈ విధానముయొక్క ప్రాతిపదికయే తప్పుగా వుంది— అని అంటున్నాను అది మనకందరికీ తెలుసు ఈ పద్ధతి ఎప్పుడో బ్రిటిషువారి హయాములో వారియొక్క పరిపాలనా విధానమును నడుపుకోటానికి ఆమోదించి ఏర్పాటు చేశారు ఆనాడు వారియొక్క పోలీసు రాజ్యమును అమలు జరుపుకోటానికి ఉద్దేశించిన taxation విధానము యిది. ఇది యిప్పటికినీ ఏమార్పుగూడ చేయబడకుండ అమలులో ఉన్నది. ఈ పద్ధతిమీద మనము యింకను ఆధారపడిఉంటే, మనము అనుకుంటున్న Welfare

State ను build-up చేసుకోటానికి, Socilistic society వైపు పురోగమిస్తున్నామా అని చూస్తే అది కనబడడంలేదు పోలీసు రాజ్యము పునాదులమీద సోషలిస్టు పునాదులకు పోయేటట్లయితే, పోలీసురాజ్యపు అంకురాలు మాత్రమే ఉంటాయి మొన్నటిదినము మన పట్టాభిసీతారామయ్యగారు మాట్లాడుతూ, "మనము కోరేది చాలా కోరుతున్నాము, ఎన్నో ఉపయోగములు చూస్తూ ఉన్నాము ఇవి అన్ని చూస్తే చాలా సంతోషంగానే ఉన్నది కాని పూర్వపు అధికార్ల మనోతత్వం మాత్రము మారలేదు, పూర్వపు అధికారముల రూల్సు మారలేదు, అప్పటి bureaucracy కూడ మారలేదు అది మారకుండ మనము ఎక్కడికి పోతున్నామో అర్థము కావడములేదు," అని clear గా చెప్పారు వారు మన ఆంధ్రదేశములో కాంగ్రెసు చరిత్రకారుడు గనుక, యీ ఊరులోనే యీనెల రెండవ తేదీన ఆయన యీవిధముగ చెప్పారు. ఆయన మాటలు మాకందరికీ చాలా ఉత్సాహకరముగా ఉంటూ ఉంటాయి

శ్రీ కె. వెంకటరావు అన్నికూడానా ?

శ్రీ వావిలాల గోపాలకృష్ణయ్య స్వతంత్ర పోరాటానికి ఆయన రమ్మని పిలచినప్పుడల్లా మేము వెళ్ళటానికి తయారుగా ఉంటూ వచ్చాము కాని ఎక్కడో చిన్నచిన్న States లోనో యీ పోరాటానికి రమ్మంటేకూడ మేము తయారుగా వెళ్ళితే, ఆయనే మమ్ములను వెనుకకు పొమ్మని అన్నాడు అందువల్ల ఒకవేళ socialism గురించి ఆయన ఒక్కొక్కప్పుడు వ్యాఖ్యానము చేస్తే మాత్రము దానిలో మాకు ఆయనకు అభిప్రాయ భేదములు వచ్చినవి అవి రాకపోతే, మేము గొర్రెలక్రింద ఉండవలసిందే.

మిస్టర్ స్పీకర్ : మీరు వారిని follow కాలేదుగదా ? సరే కానివ్వండి. మీకు యిష్టమువచ్చింది చెప్పండి మీ ఉపన్యాసము ముగించండి.

శ్రీ వావిలాల గోపాలకృష్ణయ్య · అధ్యక్షా, వారిని follow కాలేదనటానికి నేనే కాదు. వారి 'ముక్కుళ్ళముక్క' ఎవ్వరూ కూడ యింతవరకు follow కాలేదు ఎవ్వరికి అవసరము ఉంటే, వారు వారియొక్క సహాయము ఉపయోగపరుచుకున్నారు తప్ప, ఆయన యొక్క సలహాలు అన్నీ అమలు జరిపినవారు చాలా తక్కువమందే. అందులో నేను కూడ ఒకణ్ణే. ఉన్న తాశయాలు ఆయన ఏవైతే చెప్పారో అవి అన్నీ అమలుజరుపుకున్నాము కాని యితర విషయాలు మాత్రము మేము వినలేదు

శ్రీ కె. వెంకటరావు · అయితే, మీరు ఉన్న తాశయాలు అని అనకున్నా, ఒప్పుకున్నారు.

శ్రీ వావిలాల గోపాలకృష్ణయ్య మా ఉన్న తాళయాలు, ఆయన ఉన్న తాళయాలు కలిసినప్పుడు మేము ఒప్పుకున్నాము నన్ను యీ విధముగ interrupt చేస్తూ, నా attention divert చేస్తే, బహుశ యీ taxation గురించిన నా ఉపన్యాసము కొంత వరకు తప్పిపోతుందని మంత్రిగారి అభిప్రాయమనుకుంటాను

శ్రీ కె. వెంకటరావు ఏమీ భయములేదు వారు యీ taxation గురించి ఎంత వ్యతిరేకముగ మాట్లాడినా, చివరికి అందరు unanimous గా ఓటు చేస్తారని నాకు తెలుసు దానికేమి భయములేదు

మిస్టర్ స్పీకర్ ఎంతసేపు మాట్లాడినా, యీ taxation విధానము గురించే కదా ! మీకు యిచ్చిన పది నిమిషములు కావచ్చింది. ఇక రెండు నిమిషములలో ముగించండి

శ్రీ వావిలాల గోపాలకృష్ణయ్య అధ్యక్షా, నన్ను మధ్యమధ్య interrupt చేయకుండా నైనా ఉండాలి లేకపోతే మీరు నాకు టైము యిచ్చే సహాయము అయినా చేయాలి Interrupt చేసిన టైమును gain చేసుకోటానికి అవకాశము యివ్వండి

ఇప్పుడు ఉన్న taxation విధానము మార్పు చేసేవరకు, దానికి కావలసిన ప్రాతిపదికలు వేసేటంతవరకు, యీ పద్ధతిలో యీ tax యీ పద్ధతిలో వసూలుచేయటానికి నేను వ్యతిరేకము పెద్దవారి మీదనే ప్రభుత్వము పన్ను వేస్తామని చెప్పేటట్లైతే, మేము ఓటుచేయటానికి, రెండు చేతులతో కూడ ఓటుచేయటానికి అధ్యక్షులవారు ఒప్పుకుంటే, రెండు చేతులతో కూడ ఓటుచేయటానికి మేము సంసిద్ధులముగ ఉన్నాము. కాని చిన్నవాడి మీద యీ tax వేయటానికి, ప్రభుత్వము ఏవో కొన్ని కారణములు చెప్పి అమలు జరిపేటట్లయితే మాత్రము వీలు కాదు ఇంతకుముందు session లో taxation proposals తెచ్చారు అవి అమలుజరిపారు. మరల యిప్పుడు వేరే proposals తెచ్చారు ప్రస్తుత పరిస్థితులలో దేశములో కరువుకాటకాలు ఉంటుఉన్నవి. ఈ సమయములో మరల యీ new tax యివ్వమని ప్రజలను అడిగితే హర్షించరు. నిజానికి వాళ్ల యొక్క ఖర్చులను గురించిన లెక్కలు పరిశీలించితే తెలుస్తుంది. ఇప్పటికే ఎకరానికి అన్నీ చేరి 16 రూపాయలు పన్ను చెల్లిస్తూంటే ఆపన్ను ఇప్పుడు ఈ కొత్తపన్ను అంతాకూడ అవామతుశో ఉంచి, అందులో కాగితాలు అచ్చు వేయించుకున్న ఖర్చు, అన్నీ కలిపి అడిగితే, యీ 16 రూపాయల పన్ను బదులు 8 5 రూపాయలు పన్ను చెల్లించవలసి ఉంటే,

"ఎక్కడిది బాబు యింతపన్ను ?" అని అడిగితే, ఆరేటు యీ రేటు అని
చెప్పాలనో, లేకపోతే wrong అని చెప్పాలనో తెలియడంలేదు
అసలు యీ రేట్లు, యీ విధానము పన్ను వసూలుచేసే కరణమునకే
అర్థముకాదు సరికదా! అధికార్లకే అర్థముకాదు అన్ని ఒప్పుకుంటు
న్నారు, పన్ను తీసుకుంటున్నారు కనుక యిది చాలా అసంతృప్తికి దారి
తీస్తున్నది మీరు ధనిక రైతుల తరఫున నిలబడి మామీద పన్ను వేయవద్దని
అడిగితే, వారి తరఫున మేము మాట్లాడుతున్నామని ఎప్పుడుకూడ
అనుకోనక్కరలేదు. అయినను వారి తరఫున ఉండి మాట్లాడుతున్నా
రని అనను దేశములో poor peasants విషయము మనము base గా
పెట్టుకోవలసిఉన్నది వాళ్ళు సమాజములో పురోగమనానికి రావలసినవాళ్ళు
వారిని ముందుకు తేవలసిన బాధ్యత ప్రభుత్వముమీద ఉన్నదన్న విషయము
మరచిపోకూడదు. కాబట్టి ప్రస్తుతము యీ new taxation proposals ను
ప్రజాభిప్రాయము కొరకు పంపించి, వారియొక్క కష్టములను పరిశీలించి,
వారియొక్క సమ్మతముపైన యివి అమలుజరపడము మంచిది కాని ప్రస్తు
తము దీన్ని సెలెక్టు కమిటీకి పంపవద్దని సలహా యిస్తూ సెలెక్టు కమిటీకి పంప
వలెననే ప్రభుత్వము యొక్క proposal ను నేను ప్రతిఘటిస్తున్నాను

*Mr. Speaker* Motion moved

శ్రీ పిల్లలమర్రి వెంకటేశ్వర్లు (నందిగామ) అధ్యక్షా, ఒకసారి
amendment మీద మాట్లాడిన తరువాత, మరల main motion మీద మాట్లాడ
టానికి నాకు అవకాశము ఉంటుందా ?

మిస్టర్ స్పీకర్ . అది ఉండదు ఒక్కొక్కరికి ఒక్కొక్కసారే chance
యిస్తాను.

*శ్రీ పిల్లలమర్రి వెంకటేశ్వర్లు : అధ్యక్షా, రెవిన్యూమంత్రి కళా వెంకట
రావుగారు యీ బిల్లును ప్రతిపాదిస్తూ, ఏ వాదము అయితే సభ్యులు అంగీక
రించటానికి వీలుఅవుతుందని భావించారో ఆ వాదననే తీసుకొచ్చి చెప్పారు
అంటే ప్రధానముగా యీనాడు అనేక ప్రణాళికలు మనము పూర్తి చేసుకో
వాలి గనుక, వాటికి డబ్బుకావాలి గనుక, ఆ డబ్బు రావటానికి మార్గము
ఏమిటి ? ఎక్కువమంది రైతాంగముగా ఉన్న జనాభామీద యీ పన్ను
వేయాలా, అక్కరలేదా ? లేకపోతే యీ డబ్బు ఎక్కడినుంచి వస్తుంది అనే

సమస్య మనముందు పెట్టి మాట్లాడారు ఈ సందర్భములో నేను ఒక్క విషయము మాత్రము వారికి మనవిచేయదలచుకున్నాను దేశము నిజముగ అభివృద్ధిచెందాలి అనుకుంటే, అది జయప్రదముగ నెరవేరాలి అనుకుంటే, మనము అనుకుంటున్న ప్రాజెక్టులు అన్నీ కూడ అతిత్వరలో పూర్తిచేసుకోవాలి అనేదానిలో మంత్రిగారితో నేను పూర్తిగ ఏకీభవిస్తున్నాను అయితే వారు అవలంబించే పద్ధతులు చూస్తే యీనాడు మనము తలపెట్టుకున్న అభివృద్ధి ప్రణాళికలు అమలుజరపడములో కాని, అందుకు కావలసిన డబ్బు చేకూర్చుకోవడములో గాని, ప్రభుత్వము అవలంబించే పద్ధతులు మాత్రము మేము అంగీకరించలేకపోతున్నాము ఎందువల్లనంటే యీనాడు మనము ప్రధానముగ కొన్ని విషయములు ఆలోచించవలసి యున్నది పైన కేంద్ర ప్రభుత్వము ఉన్నది క్రింద రాష్ట్రప్రభుత్వము ఉన్నది మన ప్రభుత్వముయొక్క ఆదాయము అచ్చంగా వసూలు చేసుకోవడము కేవలము పన్నుల మూలముగ కాకుండ, కేంద్రప్రభుత్వము తరఫున రాష్ట్రప్రభుత్వము వసూలుచేసే సొమ్ములో నుంచి మనకు రావలసిన భాగముమీద ఆధారపడి యున్నాము ఈనాడు మనయొక్క పరిస్థితి చూచుకుంటే, మన రాష్ట్రములో సిరిసంపదలతో తులతూగుతూ ఉన్న ధనికవర్గమువారు ఉండగా, పేదవాళ్ళు, జీవనభృతికే చాలకుండా కష్టపడుతున్న రైతాంగమా ప్రభుత్వానికి కనబడ్డారు ? అలాంటి ధనికులమీద యీ పన్ను వేస్తే, వెంకట్రావుగారికి కావలసిన ధనము అంతా అతిత్వరలో చేకూరగలదని చెప్పవచ్చు ఆ విధానము మంత్రిగారు ఒప్పుకుంటే, దీన్ని ఏ మాత్రము చర్చలేకుండా ప్యాసుచేయటానికి మాకు ఎవ్వరికీ అభ్యంతరము ఉండదు కాని మంత్రిగారి అభిప్రాయములో అలాంటి పరిస్థితి కన్పించడము లేదు. ఇక మీదట పన్ను ఏ మాత్రముకూడ భరించలేని పరిస్థితి యీనాడు ప్రజలకు ఉంటున్నది ప్రభుత్వమువారి రిపోర్టుల ప్రకారము చూచుకుంటే కూడ, భారతదేశము మొత్తముమీద ఆంధ్రదేశము అంతా ఒక యూనిట్‌గా ఆలోచించినప్పటికినీ, యితర ప్రాంతాలవారి కంటే, ఆంధ్రదేశములోనివారు అంతగా సిరిసంపదలతో తులతూగడము లేదు మనము అభివృద్ధితో కూడుకుని ఉన్నామా ? ఈ విషయము తప్పకుండా ఆలోచించమంటున్నాను శాసనసభ ఎప్పుడు సమావేశమైనను, మంత్రివర్గము పన్నులు, పన్నులు అని బిల్లుల నినాదము వినబడుతున్నది ఏదైనా ప్రణాళికల విషయము చర్చించేటప్పుడు, అనగా నాగార్జున సాగర్ విషయములో గాని, లేకపోతే తుంగభద్ర హై లెవెల్ కెనాల్ విషయములో గాని, లేక రామగుండం విషయములోగాని చర్చించేటప్పుడు రెండుమూడు నిమిషములలో దానిని ఆమోదించి, అది పూర్తిచేసుకోటానికి వెంటవెంటనే పోతూఉంటాము.

కాని యీ పన్నుల విషయం వచ్చినప్పుడు మాత్రం ఎంతో ఎక్కువ కాలం వినియోగించి ప్రతి సమావేశాన్ని పన్నుల సమావేశంగా మార్చుతున్నారు తప్ప మరేమీ కాదనే సంగతి ఆలోచించవలసియున్నది భారతదేశం మొత్తంమీద మిగిలిన రాష్ట్రాలలో అన్ని వర్గాలవారు తమతమ ఆదాయమును బట్టి తగినంత భారాన్ని మోస్తున్నారా, దానితో సరిపోల్చి ఆంధ్రదేశములోని ప్రజలు ఎంత పన్నుల భారాన్ని మోయగల స్థితి ఉందో అంత భారాన్ని మోస్తున్నారా లేదా అనేది మనం తప్పకుండా పరిశీలన చేయవలసిన అవసరంవుంది ఆంధ్రదేశమునుంచి కేంద్ర ప్రభుత్వానికి తక్కువ డబ్బు పోతుందని మాత్రం అనుకోకూడదు అని నా అభిప్రాయము ఎందువల్లనంటే మొన్ననే కేంద్ర ప్రభుత్వము ప్రకటించినట్టి ఒక రిపోర్టు చూస్తే కేవలం పొగాకువల్ల 40 కోట్ల రూపాయల వరకూ కేంద్రానికి ముడుతున్నది దాంట్లో సగానికన్న చాలా ఎక్కువభాగం ఆంధ్రదేశంనుంచి పోతున్నది కాని దాంట్లోనుంచి మనకువచ్చే ఆదాయంచూస్తే చాలా తక్కువ అదేవిధంగా కేంద్రంనుంచి మనకువచ్చేడబ్బుతో మనదగ్గరనుండి కేంద్రానికి పోయే డబ్బును పోల్చిచూస్తే మనడబ్బే కేంద్రం దగ్గర ఎక్కువ వుంది అయితే కేంద్ర ప్రభుత్వానికి ఖర్చులులేవా అంటే మన ఆంధ్రదేశములో చేయవలసిన అభివృద్ధిని దృష్టిలో పెట్టుకోవలసిన అవసరం కూడా వుంది దేశంలోని మిగిలిన ప్రాంతాలతో పోల్చిచూస్తే ఆంధ్రప్రాంతం యెంతో వెనుకబడివుంది, పరిశ్రమలలో వెనుకబడివుంది. విద్యలో వెనుకబడి వుంది, అన్ని విధాలా వెనుకబడివుంది కేంద్రప్రభుత్వం ఖర్చుపెట్టేటటువంటి డబ్బంతా కూడా ఏ ఏ ప్రాంతాలయితే బాగా ముందుకు సాగిపోయినాయో ఆ ప్రాంతాలకు ఎక్కువ ఖర్చు పెట్టబడుతున్నది పన్నుల విషయంలో ఎవరి తంటాలు వారు పడాలి ఎవరి ప్రాజెక్టులకు అవసరమైన ధనం వారే వసూలు చేసుకోవాలనే విషయాన్ని తీసుకువచ్చి ప్రబోధిస్తున్నారు అందువల్ల యీ విషయాన్ని గురించి ఆలోచించినప్పుడు కేంద్రప్రభుత్వంనుంచి మనకు రావలసిన మొత్తం రాలేదు అనేటటువంటి విషయం మనకు స్పష్టంగా బోధపడుతుంది అంతేకాదు, కేంద్రప్రభుత్వం యిస్తున్నటువంటి గ్రాంట్లవిషయంలో కూడ ఆంధ్రదేశానికి తీరని అన్యాయం జరుగుతుందనేటటువంటి విషయం స్పష్టంగా బోధపడుతున్నది ఇటీవలనే University Grants Commission వారు మదరాసు బెంగాలురాష్ట్రాలు ఒక్కొక్కటికి కోటిరూపాయలు చొప్పున గ్రాంట్లిచ్చి ఆంధ్ర యూనివర్సిటీకి 10 వేలు మాత్రమే యిచ్చి తృప్తిపడమనడం జరుగుతోంది. గ్రాంట్లవిషయమైనా, loans విషయమైనా యితర ప్రాంతాలతో పోల్చి చూసుకున్నప్పుడు కేంద్రప్రభుత్వం ఆంధ్రప్రాంతంమీద సవతితల్లిప్రేమ

చూపించడం జరుగుతున్నదని మనకందరకు ప్రతినిత్యమూ బోధపడుతున్నది అలాంటప్పుడు మనం యేమిచేయాలి ? మంత్రులు (శ్రీ) గోపాలరెడ్డిగారు, శ్రీ కళా వెంకటరావుగారు చెప్పారు, "మనకు సుమారు 6 కోట్ల రూపాయలు deficit వుంది మన ప్రభుత్వోద్యోగుల జీతాలు పెంచినట్లయితే ఇంకో కోటి రూపాయలు ఎక్కువ deficit కూడా తగలవచ్చు అందువల్ల దానినికూడా పెంచుతారని ఆశించి, దానిని కలుపుకొని ఏడుకోట్ల రూపాయల deficit వేసుకున్నాం ఈ ఏడుకోట్లరూపాయల deficit ను ఎట్లాపూడ్చడం ?" అనే తహతహ మంత్రివర్గానికి అగపడుతుంది Deficit మన ఒక్కరాష్ట్రానికే లేదు మిగిలిన అనేక రాష్ట్రాలున్నాయి, బెంగాలురాష్ట్రం వుంది యు పి రాష్ట్రం వుంది వీటికి మనకంటె యెక్కువ deficit వుంది (శ్రీ) గోపాలరెడ్డిగారిని అనేక తడవలు అడిగాను ఈ విషయాన్ని పరిశీలించి అక్కడనుంచి సమాచారం తెప్పించి తెలియజేస్తాం అని చెప్పారు కాని యింతవరకు నాకు ఏ రకమైన సమాధానమూ రాలేదు మనకురెట్టింపు లోటున్న రాష్ట్రాలున్నాయి. అదనంగా పన్నులు వెసుకోకుండానే సాగిస్తున్నటువంటి పద్ధతులు వుండినప్పుడు మనం ప్రతి సమావేశాన్ని పన్నుల సమావేశంగా ఎందువల్ల మార్చవలసివస్తుందో నాకు బోధ పడటంలేదు కేంద్రప్రభుత్వ విధానాల్లో ఆంధ్రదేశానికి అన్యాయం జరుగుతున్నది. మనం పన్నులు వేసుకుంటున్నాం. ఎంత దూరం వేసుకోగలం ? ఇప్పుడేమైనా తక్కువ వేసుకుంటున్నామా? తక్కువ వేసుకుంటున్నామని నేను అంగీకరించను. 1951 వ సంవత్సరం నుండి పన్నులు ఏ విధంగా అభివృద్ధి చెందినాయో చూస్తే బోధపడుతుంది ప్రతి సంవత్సరం కూడా ఎక్కువ వేసుకుంటున్నాము రెట్టింపు అయిపోతున్నది 1951 వ సంవత్సరం నుండి యిప్పటివరకు 12 కోట్ల రూపాయలు చిల్లర పన్నులు పెరిగినట్లు అంచనాలవల్ల తేలుతాయి మొత్తం మన ఆదాయం విషయం చూసుకుని సాకల్యముగా ఆలోచించి నట్లయితే మనం ఎంతబరువు మోయాలో దానికంటె ఎక్కువ బరువు మనం మోస్తున్నాం అనేటటువంటి విషయం మాత్రం స్పష్టంగా బోధపడుతుంది. అయితే యీ మూడు బిల్లులద్వారా మళ్ళా అదనంగా యింకో రెండు లేక మూడుకోట్ల రూపాయల రాబడి మంత్రిగారు ఆశిస్తున్నారు అయితే యీ మూడు బిల్లులలో కొన్ని సిద్ధాంతాలు మాత్రమే యిమిడివున్నాయి. ఎక్కువ ఆదాయం వచ్చినవాళ్ళు లేరా అంటే, బాగా ఆదాయంవచ్చే వారిమీద పన్ను వేయమనండి, ఆలోచించవచ్చు కేంద్రంనుంచి మనకు రావలసిన డబ్బంతా సంపాదించడానికి మనం తీవ్రంగా కృషి చేయవలసిన అవసరంమాత్రం వుంది "అయితే ఏ విధంగా చేయడం ? పన్నెండు తడవలు అడిగాము. వంద తడవలు

అడిగాము, ఈయడంలేదు'' అని చెప్పవచ్చు ఇవ్వకపోతే యేమిటి కార్యక్రమం ? ఏమిటి కర్తవ్యం అనేటటువంటి విషయం కూడా మనం ఆలోచించుకోవాలి ఎంతకాలం పన్నులు వేసుకుంటాం ?

శ్రీ కె. వెంకటరావు అధ్యక్షా, సభ్యులను water cess గురించి మాట్లాడమనండి

శ్రీ పిల్లలమర్రి వెంకటేశ్వర్లు అధ్యక్షా, అంతా దానికి సంబంధించినదే మరో విషయం మంత్రిగారిని అడుగుతాను మధ్య interrupt చేసి చెప్పడం కాదు ఈ రోజున మనం చెల్లించే వడ్డీ తీసుకోండి, ''రెండుకోట్ల రూపాయలకు పైన వడ్డీ చెల్లించడం జరుగుతున్నద'' ని మంత్రిగారు చెప్పారు ద్వితీయ పంచవర్ష ప్రణాళిక కాలం అయిదు సంవత్సరాలు పూర్తయేటప్పటికి యీ వడ్డీ మొత్తం 4 కోట్ల రూపాయలు అదనంగా పెరిగే ప్రమాదం వుందని కూడా ప్రభుత్వం యిచ్చినటువంటి రిపోర్టులో వుంది అందువల్ల వడ్డీ వరుసగా పెరుగుతున్నది అదేవిధముగా ఖర్చుకూడా తప్పకుండా పెరుగుతుంది అందువల్ల యీనాడు యీ సమావేశంలో కాంగ్రెసు సభ్యులంతా ఏకగ్రీవంగా యీ పన్నులను ఆమోదించినప్పటికీ యీ సమావేశంతో యీ పన్నులబాధ తీరదనే విషయం మనం స్పష్టంగా అర్థంచేసుకోవాలి ఈ సమావేశంలో మనం యీ 2 లేక 3 కోట్ల రూపాయల పన్నుకు ఆమోదించినప్పటికీ మన deficit అట్లాగే వుంటుంది మన ఖర్చు ప్రతి సంవత్సరానికి పెరిగిపోతూనే వుంటుంది. మనం చెల్లించే వడ్డీ రేటు కూడా అంతకంటె ఎక్కువ పెరిగిపోతుంది ప్రతి సంవత్సరం యిదేవిధంగా పన్నులు వేసుకోవలసినదేనా, లేకపోతే దీనికి యేమయినా వేరే మార్గం వుందా ఆలోచించమని చెప్పాము అంతేకాదు. మంత్రివర్గానికి ఎంత నేపు అయినా ప్రజాసామాన్యం, రైతులు, పొలాలు తప్ప మరేమీ అగపడవు Iron ore వుంది (శ్రీ) కళా వెంకటరావుగారు ఒకతడవ "Iron ore వల్ల ఎంతో లాభం రాబోతున్నది నేను యితర private operators కు ఈయకుండా reserve చేసి అట్టే పెట్టాను'' అని చెప్పారు అక్కడ వున్నటువంటి పరిస్థితి చూచి చెబుతున్నాను. Iron ore లో తెలియకుండా గుంటలు పెట్టేసి private operators ఆఫీసర్లను కట్టుకుని తోలుకుపోతున్నారు నాకు తెలిసిన సమాచారం యేమిటంటే కేంద్ర ప్రభుత్వమును ముఖ్యమంత్రిగారు సంప్రదించి ఒక ఒడంబడికకు వచ్చారని, దాంట్లో వచ్చినటువంటి ఆదాయము కోటి రూపాయల వరకు సంపాదించడానికి plans వేసుకుని ఆ కోటిరూపాయలలో 60 లక్షల రూపాయలు కేంద్రప్రభుత్వానికి కట్టబెట్టడానికి కేంద్రప్రభుత్వం తీసుకుంటుందని తెలిసినది.

మిస్టర్ స్పీకర్ అవన్నీ ఈ బిల్లుకు సంబంధించినవేనా ?

శ్రీ పిల్లలమర్రి వెంకటేశ్వర్లు అవన్నీ taxation కు relevant అయిన విషయాలే ఎందువల్ల యింత taxes భరించలేమో చెప్పాను. ఆదాయం రావడానికి మంత్రిగారు ఉపోద్ఘాతంగా చెప్పినవాటికి సంబంధించినంతవరకు చెప్పాను

శ్రీ కె వెంకటరావు అసలు బిల్లుమీద కూడా కొంత చెప్పండి

శ్రీ పిల్లలమర్రి వెంకటేశ్వర్లు ఇవన్నీ మనం చూసుకున్నప్పుడు, 'national income in Andhra Pradesh' చూసుకున్నట్లయితే 691 కోట్లనుంచి 823 కోట్ల రూపాయల వరకు పెరిగింది.

మిస్టర్ స్పీకర్ 5 కోట్లు కట్టబెట్టారనకూడదు యేమి మాట్లాడారో మనకు తెలియదు ఎందుచేతనంటే ఆయన లేరిక్కడ అందుచేత వద్దన్నాను గాని, Iron ore గురించి యితర alternative proposals క్రింద చెప్పే హక్కు మీకుంది

శ్రీ పిల్లలమర్రి వెంకటేశ్వర్లు కట్టబెట్టారంటే నా ఉద్దేశ్యం అది కాదు మనకు వచ్చేది వారు తీసుకుంటున్నారని నా ఉద్దేశం అది కటువుమాట అయితే దానిని తీసి "తీసుకుంటున్నారు" అని చెప్పడానికి నాకు అభ్యంతరం లేదు పోనీ మన జాతీయ ఆదాయము ఎంత పెరిగిందో ఆ నిష్పత్తి (proportion) లో పన్నులు పెంచి తృప్తిపడడానికి ప్రభుత్వం సిద్ధంగావుందా? ఆలోచించమని అడుగుతున్నాను జాతీయాదాయంపెరిగిన నిష్పత్తిని ఆధారం చేసుకుని మన పన్నులు పెరిగాయోలేదో చూసుకుని పెరుగకపోతే అంతవరకు పెంచుకుందాం జాతీయాదాయం ఎంత పెరిగింది ? 1950–51 లో 691 కోట్ల రూపాయలుంటే 1956 వ సంవత్సరం వచ్చేటప్పటికి 823 కోట్ల రూపాయలైనది అంటే, 132 కోట్లు 'at constant prices' జాతీయాదాయం పెరిగింది. దాని శాతము 5 సంవత్సరాలకు తీసుకుంటే 19% అయినది. Percapita income 221 రూపాయలనుండి 249 రూపాయల వరకు పెరిగింది. అంటే 13% పెరిగింది వ్యవసాయవుటాదాయము 15% పెరిగింది. ఈ అదనపు పన్నులు 62% పెరిగాయి, నేను చెప్పదలచుకున్న point అదే వ్యవసాయపుటాదాయం 15%, శీర్షాదాయము (percapita income) 13%, జాతీయాదాయను 19% పెరిగితే పన్నులు మాత్రం 62% పెరిగాయి. అందువల్ల మనం తక్కువ వేసుకుంటున్నామని అనుకోడానికి కేమీ ఆస్కారం లేదు అని మాత్రం అనుకుంటాను. మన మంత్రి

గారు "రెండు కోట్లరూపాయలు వడ్డీ చెల్లించాల్సి వస్తుం"దని చెప్పారు అందులో ఎక్కువభాగం కేంద్రప్రభుత్వం దగ్గరనుంచి తీసుకున్నట్టి అప్పే "అయితే కేంద్రప్రభుత్వం ప్రజలదగ్గరనుండి అప్పు తీసుకుని అదేకదా మనకు యిస్తుంది" అని చెప్పవచ్చు కాని జరుగుతున్నది అది కాదు దాంట్లో చాలా నోట్ల ముమ్మరం వుంది, నోట్లు అచ్చుగుద్ది మనకు తీసుకువచ్చి యిస్తారు ఆ అచ్చుగుద్దే నోట్లమీద కూడా వడ్డీ వసూలు చేస్తున్నారు కనీసం వారు ఉత్పత్తి చేసేటటువంటి డబ్బు మీదనయినా సరే వడ్డీ లేకుండా చూడాలనే నేను చెప్పేది, అంతేకాదు అనేకతడవలు మేము కోరాము ఈరోజు క్రొత్తగా ప్రాజెక్టులు ప్రారంభిస్తున్నాము నాగార్జునసాగర ప్రాజెక్టు కడుతున్నాం మనకు అప్పు యిచ్చినప్పటినుంచి దానినుంచి వడ్డీ వసూలు చేయడంవల్ల అవన్నీ కలిసి యీ రోజు ఖర్చు పెరుగుతుంది అదేవిధంగా మనకు యివన్నీ రావడంవల్ల మన యొక్క ఖర్చు పెరుగుతుంది, సుమారు 30 లక్షల ఎకరాలవరకూ సాగులోకి రావలసివుంటే, చాలా తక్కువగా 5, 6 లక్షల ఎకరాలే సాగులోకి వచ్చిందని యిటీవల పత్రికలలో చూశాము

దానివల్ల ఎంతనష్టం వస్తోందో ఆలోచించమని కోరుతున్నాను ఇప్పుడు వున్న Assessment ప్రకారము 7, 8 రూపాయలు ఉన్నప్పటికి మనకు రావలసిన డబ్బు రావటంలేదు. మొదటి పంచవర్ష ప్రణాళికలోని ప్రాజెక్టులు పూర్తి అయినా, వాటి క్రింద వున్న భూములను సాగులోనికి తీసుకురాకపోవటంవల్ల ఎన్నిలక్షల రూపాయలు నష్టం వస్తున్నదో ఆలోచించవలసిన అవసరం వున్నది మంత్రివర్గము యొక్క విధానము లోప భూయిష్టముగా వున్నందువల్లనే ఇవి సాగులోనికి రాలేదని స్పష్టముగా బోధపడుతుంది పన్నులకు సంబంధించినంత వరకు మన ప్రభుత్వ విధానము తృప్తికరముగా లేదు ప్రభుత్వం ఆదాయం పెంచాలనుకొన్నప్పుడు ప్రజలందరి ఆదాయము కూడా పెరగాలి ఆంధ్రదేశములో కొంతమంది ఆదాయము విపరీతముగా పెరిగిపోయింది విపరీతంగా డబ్బును నిలువచేస్తున్నారు. అలాంటివారిపై అదనముగా పన్ను వేస్తే మాకు ఏమీ అభ్యంతరము లేదు. ఈ మూడు taxation measures లోని fundamental principle ను మంత్రివర్గము ఆమోదించవలసియున్నది తిండిలేక, తక్కువ ఆదాయముగల రైతులు అనేక లక్షలమంది వున్నారు వారి నుండి అదనపు పన్ను తీసుకోకుండా వుండాలి Water rates పెంచినా, సర్చార్జి వేసినా, కమర్షియల్ టాక్సులు వేసినా ప్రజలు బాధతో భరిస్తున్నారు ఇక అదనపు పన్నులను భరించేస్థితిలో ప్రజానీకం లేదని మంత్రివర్గానికి తెలియజేస్తున్నాను. 18¾% వున్న దానిని 37½% వరకు పెంచారు. పన్నులు వేయకూడదని నేను చెప్పటంలేదు

కాని తక్కువ ఆదాయము వచ్చేవారిని దానినుండి exempt చేయాలి చిన్న చిన్న holdings ను నిర్ణయించి, వాటిని తప్పకుండా మినహాయించాలని కోరుతున్నాను మనకు ఇచ్చిన రిపోర్టు ప్రకారం కృష్ణా, గోదావరి డెల్టాలలో రు 14-4-0 నుండి 3-8-0 వరకు vary వుంది ఏపరిస్థితిలోను 13-8-0 మించకుండా చూస్తామనె క్లాజు ఒకటి పెట్టారు తరం వారీగా చూస్తే తక్కువ ఆదాయం వచ్చేవారిపై ఖచ్చితంగా పన్ను పెంచే అవకాశం నీటి తీరువను పెంచే అవకాశం వుంది ఈనాడు 6-0-0 నుండి రు 14-8-0 వరకు చెల్లించే భూములు వున్నాయి 14-0-0 చెల్లించే సారవంతమైన భూమిపై ఈ పరిస్థితిలో పెరగదు ఎక్కడైతే ఎక్కువ ఆదాయము వస్తుందో అక్కడ ఈ పన్నులు పెంచటం జరుగదు తక్కువ ఆదాయం వచ్చేదానిమీదే పన్ను పెంచే ప్రమాదము వున్నది ఆ విషయాన్ని తమ దృష్టిలో వుంచుకోవలసినదిగా మంత్రివర్గాన్ని కోరుతున్నాను వీటిలో ఎగ్రికల్చరల్ ఇన్‌కమ్‌టాక్సు ఎందుకు వదిలివేశారో ..

శ్రీ కె వెంకటరావు ఈ బిల్లుకు అది సంబంధించినదికాదు. అది ఎల్లుండి రావచ్చు

శ్రీ పిల్లలమర్రి వెంకటేశ్వర్లు యింకా నా sentence పూర్తికాలేదు వెంకట్రావుగారు పూర్తిగా వింటే తెలుస్తుంది

శ్రీ కె. వెంకటరావు ఇంత ఓపికగా నాజన్మలో ఎప్పుడూ కూర్చోలేదు కర్నూలులో వుండగా వెంకటేశ్వర్లుగారు ఇంత దీర్ఘంగా ఎప్పుడూ మాట్లాడ లేదు

శ్రీ పిల్లలమర్రి వెంకటేశ్వర్లు ఎగ్రికల్చరల్ ఇన్‌కమ్‌టాక్సు ఎప్పుడూ రాదు అది రాకుండా చేశారు కాబట్టి ఇప్పుడు చెబుతున్నాను.

శ్రీ కె. వెంకటరావు అది సర్చార్జిలో వస్తుంది.

శ్రీ పిల్లలమర్రి వెంకటేశ్వర్లు ఎగ్రికల్చరల్ ఇన్‌కమ్‌టాక్సు అనే principle మంత్రివర్గం give up చేసిందని అనుకొంటున్నాను హైదరాబాదులో చక్కని లెజిస్లేషన్ వుండగా, యింకా సవరించి ఆంధ్రదేశానికి వర్తింపచేయటానికి బదులు దీనిని పూర్తిగా రద్దుచేశారు 37½% పెంచటంవల్ల లాండు సెస్సు పెరిగే ప్రమాదము వున్నది. రు 0-5-0 లాండుసెస్సు పెరుగుతుంది పన్ను యింకా ఎక్కువగా పెరుగుతుందని నేను అనుకొంటున్నాను నీటితీరువ పెంచినతరువాత 70 లక్షలు అదనంగా ఆదాయం వచ్చేటట్లుగా వుంది. ఈ రూపములో ఈ బిల్లును ఆమోదించడం కష్టసాధ్యమైన విషయము. చిన్న

చిన్న holdings చాలా వున్నాయి వీటన్నింటిని తప్పక exempt చేయాలి గనులు, iron ore మొదలైనవాటిపై ఎక్కువ ఆదాయాన్ని రాబట్టడానికి ఈ ప్రభుత్వము ప్రయత్నించాలి భూమిమీద పన్ను వేయడంకంటే industries మీద iron ore గనులు మొదలైనవాటిపై పన్నులువేసి ఎక్కువ ఆదాయాన్ని రాబట్టాలి అంతేకాని ప్రజలపై ఈ అదనపు పన్నులభారం వేస్తే వారు ఆ భారాన్ని మోసేస్థితిలో లేరు దీనిని public opinion కు పంపాలి ప్రజాస్వామ్యములో, సోషలిజంలోను విశ్వాసము వున్నవారము కనుక దీనిని ప్రజాభిప్రాయానికి పంపితే ఒక నెలలోపుగా తెలిసిపోతుంది కనుక, దానిని ప్రజాభిప్రాయానికి పంపే అవకాశమును కల్పించవలసిందిగా కోరుతూ ఇంతటితో సెలవు తీసికొంటున్నాను

శ్రీ జి. లచ్చన్న (సోంపేట) అధ్యక్షా, ఇది మెట్టలో వేసే మాగాణి పంటలకు సంబంధించిన నీటి పన్నుకు, water assessment కు, సంబంధించిన బిల్లు అనే సంగతి అందరకు తెలిసిన విషయమే దీనిని సెలక్టు కమిటీకి రిఫర్ చేయాలనే ఆలోచనలో మన సభ ఎదుటకు water rate ను పెంచుటకు, wet assessment పెంచుటకు ఈ బిల్లు ప్రతిపాదించబడింది Finance కు సంబంధించిన ఈ బిల్లును సెలక్టు కమిటీ సంపూర్ణంగా చర్చించవలసిన అవసరం వుంది కనుక ఆ సెలక్టు కమిటీ దృష్టికి కొన్ని విషయాలు తీసుకురావటానికే నేను ఈ ఉపన్యాసము చేస్తున్నాను Wet assessment దానిలో ప్రధానమైనది ఇప్పుడు ఇది ఎంత ఉన్నది ? ఇది ఎక్కువా ? తక్కువా ? యింకా ఎంత ఎక్కువ చేయాలి అనే విషయాలు వున్నాయి వ్యవసాయ భూములకు ప్రభుత్వము నీరు సరఫరా చేస్తున్నందుకు పన్ను ఇవ్వాలని మన అందరకు తెలుసు కాని దురదృష్టవశాత్తు, ఇప్పుడు నీరు సరఫరా చేస్తున్నట్లులేదు నీటి సరఫరాతో పండించిన పంట అవునా ? కాదా ? అనే విషయమును రివిన్యూ అధికారులు వ్రాసిన రికార్డులలో వున్నప్రకారం ఈ పన్ను వసూలు చేయటం జరుగుతుంది ప్రకృతిరీత్యా వచ్చిన ప్రతిబంధకముల విషయం కాకుండా "ఎంతవరకు, సక్రమంగా, సకాలములో నీరు సరఫరా చేస్తున్నారు ? తన ధర్మాన్ని ప్రభుత్వం సరిగా నిర్వర్తిస్తోందా ? ఉన్న వాగులు, చెరువులు సక్రమంగా వున్నవా, లేవా, బాగుగా లేకపోయిన ఎడల బాగుచేయించాలి" అనే ఆలోచనలు ఈ ప్రభుత్వానికి లేవు. మాగాణి కాబట్టి, వరి పండిస్తున్నారు కాబట్టి, wet assessment పూర్తిగా వసూలు చేయవలసిందనే ధోరణిలోనే వుంది. ముఖ్యంగా జమిందారీ ప్రాంతాలకు సంబంధించిన విషయాలు నేను మాట్లాడుతున్నాను. ఆంధ్రదేశంలో కృష్ణా, గోదావరి డెల్టాలు సారవంత

మైనవి అదృష్టవశాత్తు కేంద్రప్రభుత్వ సహకార సానుభూతుల వలన కృష్ణ ఆనకట్టకు ప్రమాదము తప్పటమేకాక ఆయకట్టుయొక్క శక్తి, విస్తీర్ణము పెంచే అవకాశము కల్గింది కాని గోదావరి డెల్టా ప్రాంత విషయము చాలా ఆందోళనకరముగా వున్నది రెవెన్యూమంత్రిగారికి స్వానుభవము వుంది ప్రత్యేకంగా ఆ ప్రాంతములోని అన్ని వివరాలు వారికి తెలుసును

గోదావరిడెల్టాలలోని నీటి capacity పడిపోతున్నదని, అటువంటిచోట water rate పెంచడం చాలా అన్యాయమని ఆందోళన ఉండగా, మిగత ప్రాంతాలను గురించి నేను ప్రత్యేకంగా మనవిచేయవలసిన అవసరంలేదు. ఎస్టేటు ప్రాంతాలకు సంబంధించి ఒక్క శ్రీకాకుళం, విశాఖపట్టణం జిల్లాల విషయమేకాదు నేను మనవిచేసేది పశ్చిమ గోదావరి జిల్లాలోనూ, తూర్పు గోదావరి జిల్లాలోనూ కూడా కొన్ని ఎస్టేటు ప్రాంతాలున్నాయి చెరువులు, గడ్డలు, వాగులు వున్నటువంటి ప్రాంతాలలో సాగుబడికి ప్రభుత్వంవారేమీ నీరు సరఫరా చేయడంలేదు ఆ ప్రాంతాలు తల్లి, తండ్రిలేని ఒక అనాధ శిశువుగా ఉంటున్నాయి. జలాధారాల్లేని భూములను రైతులు తమస్వయంకృషితో దొరువులు చేసుకొని, బావులు త్రవ్వుకొని, గూడలు వేసుకొని వ్యవసాయం చేస్తున్నారు చిన్న రైతులు భార్యాభర్తలు, రాత్రింబగళ్ళు ఎంతో కష్టపడి ఒక గోయి త్రవ్వుకొని అందులోని నీరు ఉపయోగించుకొంటుంటే నీవు ప్రభుత్వ జాగాలో గోయి త్రవ్వినావు, అందులోని నీరు ఉపయోగించుకొంటున్నావు, కాబట్టి ప్రభుత్వానికి పన్ను చెల్లించవలసినదే" అంటున్నారు ఇప్పుడు ఒక కాలవవుండి, ఆ కాల్వక్రింద కట్ట వుండి, సకాలంలో దానికి బల్లవేసి, అక్కడ కొంత సిబ్బంది, ఇద్దరో, ముగ్గురో ప్రభుత్వ ఆఫీసరులు అక్కడవుండి time ప్రకారంగా నీరు సరఫరాచేసిన భూములకు ఏ రకంగా శిస్తులు వసూలు చేస్తున్నారో అదే రకంగా ప్రభుత్వ జాగాలో బావి త్రవ్వుకొని, నీరు వాడుకొంటూ, స్వంత పెట్టుబడితో, స్వయంకృషితో కష్టపడి చేసుకొంటున్న వారిపై కూడా పన్నులు విధిస్తున్నారు "ప్రభుత్వ జాగాలో నీరు ఉపయోగించావు, అందువల్ల water assesment చెల్లించి తీరవలసిందే" అని జబర్దస్తీగా వసూలు చేయడం జరుగుతోంది ఈ జబర్దస్తీ ఎంతోకాలం జరుగదని నేను ప్రభుత్వానికి మనవిచేస్తున్నాను ఏనాడో ఒకనాడు చాలా తీవ్రమైన పరిణామం వస్తుంది. ఈనాడు water assessment క్రింద ఇపుడున్న rate న్యాయమా, అన్యాయమా అనికాదు నేను మాట్లాడేది రైతులకు నీరు యిచ్చి నీటిపన్ను వసూలుచేస్తున్నామా, లేదా అనే విషయమై నేను ప్రత్యేకంగా మీ ద్వారా ప్రభుత్వ దృష్టికి తెస్తున్నాను. అసలు నీటి సరఫరా చేస్తున్నారా లేదా అనే సమస్య. కాని

ఎంత rate వసూలుచేస్తున్నారనే సమస్య వేరు ఇది చర్చించడానికి చాలా వివరాలున్నాయి నీరు సరఫరాచేసి నీటిపన్ను వసూలుచేస్తున్నారా, సరఫరా చేయకుండానే వసూలుచేస్తున్నారా అనేది ఆలోచిస్తే ముఖ్యంగా ఎస్టేటు ప్రాంతాలలో నీరు సరఫరా చేయకుండానే జబర్దస్తీగా, నిరంకుశంగా వసూలు చేస్తున్నారు ఇది చాలా అన్యాయం, దీనిని ఆపుచేయవలసిన అవసరం ఉన్నది సెలక్టు కమిటీలో దీనికి అవసరమైన నిర్ణయాలు చేయవలసియున్నది లేకపోతే ప్రజలంతా కొంతకాలం సహించి ఊరుకుంటారు, అంతవరకూ మాత్రం పను లన్నీ సాగుతాయి ప్రజలు భరించలేనప్పుడు మనం పనులేమీ సాగించలేము అనేక సాధకబాధకాలు వస్తాయి నేను ఈనాడు శాసనసభ్యునిగా ఉండి మాట్లాడుతున్నానని కొందరు అనుకోవచ్చు కాని నా విషయం ఈనాటి ముఖ్యమంత్రిగారికీ, రెవిన్యూ మంత్రిగారికీ తెలుసును వారు యిచ్చిన అవకాశమువల్లనో, మరే యితర అవకాశంవల్లనో నేను రెండేళ్ళపాటు మంత్రిగా ఉన్నప్పుడు కూడా ఈ విషయమై పట్టుదలతో చర్చించి కృషి చేశాను ఈ విషయం నేను ఎందుకు మనవిచేయవలసివచ్చిందంటే—రాజకీయ కారణాలను బట్టి, మురాలను బట్టి, వేరే అవకాశం లేదుకాబోలు— యిప్పుడు యిట్లా మాట్లాడుతున్నారు అనుకోవడం పొరపాటు నేను మంత్రిగా ఉన్నప్పుడు జరిగిన ఒక ఘట్టం మనవిచేస్తాను నేను మంత్రిగా వుండి శ్రీకాకుళం జిల్లా ప్లానింగ్ కమిటీలో నేను అధ్యక్షతవహించి meeting ను conduct చేస్తున్న ప్పుడు నేను అధ్యక్షునిగా, మంత్రిగా నీటి సరఫరా చేయాలని, లేనిచోట నీటి పన్ను వసూలుచేయడానికి వీలులేదనీ ఒక తీర్మానం జిల్లా ప్లానింగ్ కమిటీలో చేయించాను. అవి ప్రభుత్వ రికార్డులో కూడా ఉన్నాయి నేను ఈ రోజున కావాలని క్రొత్తగా ప్రతిపత్తి పాదన తీసుకురావడానికి ఏదో చేస్తున్నాననీ అనుకోవడం పొరపాటు అని మనవిచేస్తున్నాను కాని ఈ నీటి పన్ను విషయాన్ని ప్రభుత్వం గమనించకుండా, నీరు సరఫరా చేయకుండా పన్ను వసూలుచేయడం ప్రభుత్వ ప్రాథమిక సూత్రాలకూ, కనీస ధర్మానికి కూడ విరుద్ధమని, వాటిని విస్మరించడమేనని, ప్రజలను అన్యాయంగా దోపిడీ చేసుకోడమే గాని మరొకటికాదని మనవిచేస్తున్నాను.

మన దేశంలో అనేక ప్రాజెక్టులున్నాయి శ్రీకాకుళం జిల్లాకు సంబంధించి పాడిగాం, వంశధార ప్రాజెక్టులున్నాయి ఏ రోజున, ఏ శాస్త్రజ్ఞులు దానికి ముహూర్తం పెట్టి, ఆ పని ప్రారంభించారో కాని, యింతవరకూ దాని విషయం అతీగతీ కాలేదు. వేరే, అనేక పనులు జరుగుతున్నాయి కాని, కొన్ని యుగాలుగా జమీందారీ విధానాలలో సంపూర్ణంగా నశించిపోయి, నలిగిపోయిన

ప్రజలకు ఈరోజున జమీందారీ విధానం రద్దుచేసినతర్వాత కూడా, ఏదోరక్షణలు కలిగిస్తామని చెబుతూ కూడ వారికి ఏమీ సదుపాయం చేయలేదు దురదృష్ట వశాత్తు ఈనాడు యిది లచ్చన్నగారి నియోజకవర్గం కాబట్టి అక్కడ ఏమీ పని చేసేదిలేదు

*Mr Speaker* **That the hon Member need not say**

శ్రీ జి లచ్చన్న పార్టీ గురించికాదు, పార్టీలో అనుకొంటే ఫరవా లేదు, ప్రజలే అనుకొంటున్నారు కాబట్టి తమ దృష్టికి తెస్తున్నాను ప్రజలలో యిటువంటి వాదనలు ఎన్నో ఉన్నాయి వాటన్నింటి విషయమై యిక్కడ అవకాశం తీసుకుని చర్చించాలని కాదు నా ఉద్దేశం యదార్థంగా ఈనాటి పరిస్థితిని అర్థంచేసుకోవాలి ప్రభుత్వంవారు ఒక ప్రక్క అనేక వాగ్దానాలు చేస్తున్నారు రెండు, మూడు **general elections** గడచిపోతున్నాయి మనకు 1947 సం లో స్వాతంత్ర్యం వచ్చినా, 1937 నుంచీ రాష్ట్రంలో కాంగ్రెస్ మంత్రివర్గ నిర్మాణాలు ఉంటున్నాయి అప్పటి నుంచీ ప్రజలకు యిస్తున్న వాగ్దానాలు. ఏవి ఎంతవరకూ ఆచరణలో పెట్టామనేది ఆలోచించుకుంటే ఏమీ చేయలేదని చెప్పకతప్పదు అందువల్ల శ్రీకాకుళం జిల్లాలో ఏమీ చేయ లేదని నేను చెప్పుటలేదు

నారాయణపురం ప్రాజెక్టు కట్టారు అక్కడ తోటాడ కుడికాలువ పని చేస్తున్నారు. సాలూరు, పాతునూరు, మున్నగు ప్రాజెక్టుల పనులు జరుగు తున్నాయి సుమారుగా ఆరుఏండ్లనుంచి చేస్తున్నా కాంగ్రెసుపక్షాన, కాంగ్రెసు మంత్రిగారి పక్షాన చేయబడిన వాగ్దానాలు ఎంతమాత్రమూ చెల్లించబడలేదు ఆ వాగ్దానాలకు అతీగతీ లేదు అన్నీ **plans** లో ఉన్నాయి 'అంగట్లో అన్నీ ఉన్నాయి, కాని అల్లునినోట్లో శనిఉన్నది' అన్నట్లుగా ప్రస్తుతం వ్యవహారం సాగుతోంది ఇది ముఖ్యంగా గమనించాలి నీటిసరఫరా విషయమై **Select Committee** లో సంపూర్ణంగా చర్చించవలసి వుంటుంది మిగతా పనులగురించి వేరే బిల్లులున్నాయి కాబట్టి వాటినిగురించి నేను యిప్పుడేమీ చర్చించదలచుకో లేదు, కాని **water rates** కు సంబంధించిన విషయంలోనే స్వయంకృషిపై గూడలు వేసుకొని, బావులు త్రవ్వుకొని సాగుబడి చేసుకొంటున్న వారిమీద కూడా కాల్వలద్వారా, సిబ్బందిద్వారా **time** ప్రకారంగా సరిగా నీరు అందించే భూములపై విధించే పన్నునే వసూలు చేయడం చాలా అన్యాయం. ఇది భరించడానికి వీలుండదు అందువల్ల ఈ విషయమై **Select Committee** లో తప్పకుండా ఆలోచించి **exemption** యిస్తారని ఆశిస్తూ నేను సెలవు తీసుకొంటున్నాను.

* శ్రీ వి గోపాలకృష్ణ (పిఠాపురము) అధ్యక్షా, ఈ బిల్లు సెలక్టు కమిటీకి వెళ్ళే సందర్భంలో అక్కడ ఈ విషయాన్ని క్షుణ్ణంగా పరిశీలిస్తారనే అభిప్రాయంతో తమద్వారా ప్రభుత్వానికి కొన్ని విషయాలు మనవి చేస్తాను జమిందారీలు రద్దయిన తరువాత ఆ ఏరియాలో ఉన్న నీటి వనరులలో ప్రభుత్వంవారు శ్రద్ధ తీసుకొని నీటి సరఫరా చేయించలేదని, ఉన్న నీటి వనర్ల నైనా బాగుచేయించలేదని ప్రభుత్వంవారికి తెలియచేయుటకు చాలా విచారిస్తున్నాను జమీందారీలు రద్దయితే అనేక మంచిపనులు జరుగుతాయని యావన్మంది ప్రజలు ఆశించారు ప్రభుత్వంవారు జిరాయితీ రేట్లను సమన్వయ పరచడంలో పిఠాపురం జమీందారీలో ఉన్న రైతులు జమిందారీ సమయంలో కంటె హెచ్చు పన్నులు కట్టుకోవలసిన పరిస్థితి ఏర్పడుతోంది వారు చాలా బాధపడుతున్నారని ప్రభుత్వానికి తెలియచేస్తున్నాను ప్రభుత్వంవారు ఏ విధమైన నీటి సరఫరా చేయకుండా, కొండవాగులద్వారా, చెరువులు ద్వారా వచ్చే నీటితో వ్యవసాయం చేసుకొంటున్న రైతులనుండి నీటి తీరువా వసూలు చేస్తున్నారు క్రిందటి సంవత్సరం పెంచిన అదనపు నీటితీరువావల్ల ఎకరానికి 22 రూ॥లు ప్రభుత్వానికి చెల్లించుకోవలసిన పరిస్థితి రైతులకు ఏర్పడింది కొండ వాగులు, కొండ చెరువులు వుండే ప్రాంతాలలోని భూములు కేవలం వర్షాధారములవడంవల్ల వర్షాలున్నప్పుడు మాత్రమే ఆ భూములు సాగు అవుతున్నాయి గొల్లప్రోలు ఫిర్కాలోని ధర్మవరం, చేబ్రోలు మున్నగు గ్రామాలలోని సుమారు రెండు వేల ఎకరాల భూమిని సెప్టెంబరు నెలలో ఊడ్చినారు కేవలం అవి వర్షాధారమైన భూములు అక్కడ నీటిని పాడై పోకుండా చెరువులలో వుంచుకొని దానిద్వారా వ్యవసాయం చేసుకోవలసి యుంటుంది. ఇప్పుడు 20 ఎకరాల ఆయకట్టు దాటిన చెరువు ఉన్నట్లయితే ఆ చెరువుక్రింద exemption తీసేసి, పన్ను వేయడానికి ప్రభుత్వంవారు ఈ బిల్లులో ఉదహరించారు. ఇది న్యాయసమ్మతమేనా అని అడుగుతున్నాను ఏ మాత్రం **moral standards** ఉన్నప్పటికీ ప్రభుత్వంవారు యిటువంటి నిర్ధారణకు రారని నాకు నమ్మకం ఉన్నదని కూడా తమద్వారా ప్రభుత్వానికి మనవిచేస్తున్నాను.

మరమ్మతులు చేయిస్తూండలేదా అని అడగవచ్చును చేస్తున్నారు. దేనికి చేస్తున్నారు. రైతాంగానికి అవసరమైన మరమ్మతులు చేస్తున్నారా? లేక కేవలం మరమ్మతులు చేశామనే నెపంతో ఖర్చు చేయడానికే చేస్తున్నారా? అని అడుగుతున్నాను. ఒక అత్తగారికి ఏడుగురు కోడళ్ళుండేవారట. ఒకావిడది వంటచేయడంపని, ఒకావిడది పీటలు వేయడంపని, ఒకావిడది విస్తర్లు వేయడంపని, ఒకావిడది వడ్డనచేయడంపని, ఒకావిడది విస్తర్లు తీసివేయడంపని,

ఒకావిడది పీటలు తీసివేయడంపని, ఒకావిడది కడిగివేయడంపని కాని భర్తలు వచ్చి భోజనం చేశారా అనేటటువంటి విషయం అవసరమేలేదు అందువల్ల భర్తలకు తిండిలేకుండా వారు వస్తుండడం జరుగుతూవచ్చేది ఆ విధంగా ప్రభుత్వంచేసే మరమ్మతులు జరుగుతున్నాయి ఆనకట్టలకు కావలసిన మరమ్మతులు చేయటంకాని, నీటివసరులనుంచి వచ్చేటువంటి నీటిపుంతలను బాగుచేయడం కాని లంకలలో మేటలుతీయడంకాని, చెరువుల గర్భాలను లోతుచేయడంకాని, అటువంటివేమీ లేకుండా చెరువుచుట్టూ గుంటలుపెట్టి చెరువుగట్టులు వేయడం తోటే చెరువు మరమ్మతు అయిపోయిందనే ధ్యాస పెట్టుకొని నీటితీరువా పన్ను వేశామని చెప్పుట చాలా శోచనీయం అదికాకుండా రెవెన్యూ మంత్రి గారు సెలవిచ్చినట్లు Italy లో కాని, ఆస్ట్రేలియాలో కాని పనిచేసి దానిమీద ఫలితం అనుభవించడానికి మొదటి సంవత్సరం సావకాశంయిస్తారు ఆ వచ్చిన ఫలితాన్ని పురస్కరించుకొని ప్రభుత్వం వారికి ఏ విధంగానైనా కొంత చేదోడు వాదోడుగా వుండడానికి వీలుగా మొదటి సంవత్సరం ఏమీ లేకుండా, 2 వ సంవత్సరం 4 వ వంతు, 3 వ సంవత్సరం అర్ధ, అలాగ progressive గా పన్ను యివ్వడమనేది అక్కడ ఆ దేశాలలో ఆచారం ఉంటే ఆవిధంగా మన ప్రభుత్వం చేయలేదు

శ్రీ కె. వెంకటరావు క్రొత్తగా చేసే పనులనుకూడా దీనిలోనికి తీసుకురండి

శ్రీ వి గోపాలకృష్ణ అక్కడ ఆ విధంగా ఉంటే, ఇక్కడ అసలు ఏ పనులూ చేయకుండానే water tax ను enhance చేస్తున్నారంటే మన యొక్క standards of administration లోను, వాళ్ళయొక్క standards of administration లోను గల తేడాలను ప్రభుత్వంవారు గమనించాలని నేను ప్రభుత్వానికి మనవిచేస్తున్నాను ఇదే కాకుండా నీటితీరువా పెంపకంలో కనీసం ధాన్యం బస్తా ధర అయినా రైతు యిచ్చేటటువంటి పన్ను ప్రభుత్వంవారికి గిట్టుబాటు కావడంలేదు అన్నారు బస్తా ధర యింత ఉంటుంది అనేటువంటి ఒక కనీస ధర్మంతోటి అమ్ముకోడానికి కూడా ధైర్యం లేకుండా ప్రభుత్వంవారు ఈవేళ చేస్తూ ఒక బస్తా ధర కూడా రావడంలేదే అని చెప్పడం చాలా శోచనీయం ఏదైనా రైతు ఎలాగోఅలాగ కష్టపడి నీటి సదుపాయాలు లేకపోయినప్పటికీ కూడా వర్షాధారమైనటువంటి భూములనైనా సరే తన కాయకష్టంతో పండించుకుంటూ ఏదోవిధంగా చేదోడువాదోడుగా కొంత స్థిరపడదామన్న భావంతో ఉన్న రోజుల్లో ఆ స్థితి కూడా కల్పించకుండా అతని యొక్క ధాన్యం ధర ఏమాత్రం పెరిగినప్పటికీ కూడా ఏ విధమైనటువంటి గ్యారంటీలు

లేకుండా ఎరువు యొక్క ఖరీదును నిర్ణయం చేశారా? లేకపోతే కూలీ రేటును నిర్ణయించారా? అటువంటి సౌకర్యాలు కూడా అతనికి కలుగచేయకుండా అతని ధాన్యం ధర విషయంలో మాత్రం ప్రభుత్వంవారు గట్టి అదుపుతెచ్చిపెట్టడం చాలా శోచనీయం ప్రభుత్వంవారు ఈ జమీందారీ ప్రాంతాలలో నీటివనరుల విషయంలో కూడా హెచ్చు శ్రద్ధతీసుకొని ఆ నీటివనరులను బాగుచేసి, ఆ బాగుచేయబడిన నీటివనరులపైననే పన్ను వేస్తే బాగుంటుందికాని, మామూలు వడ్డనగానే అంతా ఒకే విధంగా దీనిని అమలు పరచడమనే విషయం చాలా శోచనీయమైనది Finance Minister గారైన శ్రీ గోపాలరెడ్డిగారు, Planning Minister గారైన శ్రీ వి బి రాజుగారు రెండునెలలక్రితం తూర్పుగోదావరిజిల్లా Planning Committee కి వచ్చినప్పుడు కూడా అక్కడి రైతాంగం "మీరు పన్నులువేస్తామని చెప్తున్నారు. మీకు moral గా పన్నులు వేయడానికి ఏమి అధికారం ఉంది ? మీరు ఏవిధమైనటువంటి సౌకర్యములు మాకు కలుగజేసి మీరు పన్నులు వేస్తున్నారు" అని నిలదీసి అడిగారు. మామూలుగా స్వతస్సిద్ధంగా వచ్చేనీరును కూడా రైతులు సరిగా వంపకం చేసుకుంటుంటే ఆ పంపకాలకు కూడా అడ్డుపడి నీరును సక్రమంగా పారించలేక రైతులను అనేకవిధములైనటువంటి ఇబ్బందులకు లోనుచేసి ఉద్యోగస్తులు వ్యవహరిస్తూంటే మనం ఇక్కడఉండి మీకు నీరు పారిస్తున్నాము కనుక ఎప్పుడో మా తాతలు నేతులు తాగారు ఇపుడు మా మూతులు వాసన చూడం"డని చెప్పేపద్ధతిలో పరిపాలన సాగిస్తున్నారు జమీందారీ areasలో ఉన్న నీటి వనరులను ఏవిధంగానూకూడా బాగుచేయకుండా, future planలో కూడా అభివృద్ధి పనులు చేయడానికి వీలు కల్పించకుండా పన్నులు తీసుకోవచ్చా? గోదావరి క్రింద ఆయకట్టుక్రిందనున్న భూమి, కృష్ణా ఆయకట్టులోని భూమిపై శిస్తు పెరుగుతోందని ప్రకటిస్తూ, అన్నిచోట్లాకూడా ఈ పన్ను వేయడమనేది చాలా విచారకరమైన విషయం ముఖ్యంగా ఏ చెరువుక్రిందనైనా 200ల ఎకరాలు సాగవుతున్నా వాటిమీద కూడా ఈ నీటి తీరువాపన్ను వేయడంవల్ల చాలా దుర్భరపరిస్థితులు కల్పించడమే కాకుండా విపరీత పరిణామాలు కూడ కలుగుతాయి. నేను లేనివాటిని సృష్టించి చెప్పి ఈ విధంగా ప్రభుత్వం వారిని అపవాదులోకి తీసుకురావటానికి ప్రయత్నించడం లేదు పల్లె గ్రామాల్లోని ప్రజలు చాలా విపరీతమైన భావాలతో ఉంటున్నారు ఇంకా అదనపు పన్నులు వేయడంతో వారి భావములను ఇంకా దోహదం చేసిన వాళ్ల మౌతున్నాము. కనుక Select Committee లో ఇది పరిశీలనకు వచ్చినపుడు జమీందారీ ప్రాంతాలలో, 2 వందల ఎకరాల ఆయకట్టు కలిగిన

చెరువుల క్రింద అసలు పన్ను లేకుండాను, ముఖ్యంగా కొండవాగుల క్రింద సాగయ్యేటటువంటి ఆయకట్టుల విషయంలో కూడా ప్రభుత్వం శ్రద్ధ తీసుకోక పోయినా కనీసం వాటిపై ఈ తీరువాను పెంచకుండా వుండేటట్లు చేయాలని కోరుతున్నాను

* శ్రీ ఎన్ పి చెంగల్రాయనాయుడు అధ్యక్షా! మంత్రిగారు ప్రవేశ పెట్టిన ఈ బిల్లును బలపరుస్తూ కొన్ని సూచనలు చేయాలనుకున్నాను ముఖ్యంగా ప్రభుత్వం ఈవిధంగా పన్నును వేసినతరువాత, వీటి నన్నిటినీ standardise చేస్తామని మంత్రిగారు చెప్పినారు ఒక కమిటీ వేస్తాము, ఆ కమిటీతో బిల్లు ఈ standardisation సూత్రాలన్నీ కూడా ఆంధ్రరాష్ట్రంలో ఒకే రకంగా ఉండేటట్లుగా ఏర్పాటుచేస్తామన్నారు పోయిన సంవత్సరంకూడా ఈ పన్నును వేసినపుడు, అపుడు ముఖ్యమంత్రిగా ఉండిన శ్రీ గోపాలరెడ్డిగారు, రెవిన్యూ మంత్రిగా ఉండిన శ్రీ చంద్రమౌళిగారు కూడా ఈ మాదిరిగానే కమిటీ వేస్తాం, ఈ పన్నులన్నీ కూడా ఒకేవిధంగా ఉండేటట్లు చేస్తామని సెల విచ్చారు వారు సెలవిచ్చిన విధంగా ఏమీ జరగకపోగా మరొక క్రొత్త పన్నును వేస్తున్నారు మనం పన్నులు వేసేటపుడు దేశ పరిస్థితులను కూడా గమనించ వలసి ఉంటుంది మంత్రిగారు మాట్లాడుతూ తన చిన్నతనంలో ఎకరాకు 10 బస్తాలు పండే భూములు ఇపుడు ఎకరాకు 20 బస్తాలు పండుతున్నాయని చెప్పినారు మా చిన్నతనంలో మా భూముల్లో ఎకరాకు 30 బస్తాలు పండేది. ఇపుడు 10 బస్తాలు మాత్రమే పండుతోంది అది వ్యవసాయం చేసేవారి శక్తి సామర్థ్యాల లోపమే కావచ్చు లేకుంటే అక్కడ భూమికి వచ్చే నీటి వనరుల లోను ఉండవచ్చు ఆ కాలంలో భూములకు ఆ పంటైనా పండటానికి కావలసిన నీటిఆధారం నమ్మకంగా ఉంటూఉండేది కాని ఇపుడు అటువంటి నీటిఆధారం లేకుండా సంవత్సరానికి ఏదో ఒకతూరి వర్షం పడడం, ఆ వర్షపు నీరు ఏ పది రోజులకో, ఏ నెలరోజులకో చెరువులకు రావడం, ఆ తరువాత అవి ఎండిపోవడం జరుగుతోంది. అయితే లెక్కలు మాత్రం పూర్తిగా ఆ భూములు ఆ చెరువు నీటితోనే సాగైనట్లు ఉంటాయి. ఆ లెక్కలను తయారుచేసే కరణాలు ఆ చెరువు దగ్గరకు ఎపుడూ పోయిన పాపానపోరు. భూములు పండివాయో లేదో చూడరు. వారు వారి ఇండ్లలోనే కూర్చొని వర్షంవచ్చినట్లు ఊహించు కొని, పంటలు పండినట్లు ఊహించుకొని లెక్కలు తయారుచేసి ప్రభుత్వానికి పంపుతారు అందువల్ల రైతులు డబ్బు యివ్వవలసి వస్తూఉంది పంట పండ కుండాపోతే పన్ను తీసివేస్తామని మంత్రిగారు చెప్పవచ్చు పంటలు పండలేదని కరణాలు లెక్కలు వ్రాస్తేకదా ప్రభుత్వంవారు పన్ను తీసివేసేది. కరణం

లెక్కలు వ్రాయకుండాపోయినపుడు ఏమిచేస్తారని నేను మంత్రిగారిని అడుగుతున్నాను మనం ప్రతి తూరి కూడా రైతుల మీదే పన్నులు వేస్తున్నాము మనం ప్రతితూరికూడా రైతుల మీద పన్నులు వేస్తున్నపుడల్లా దీనిని ఇపుడు విధిలేకుండా వేస్తున్నాము ఇపుడు అత్యవసర ఖర్చులు ఉన్నాయి కాబట్టి, Plan నిలిచిపోతుంది కాబట్టి ఈ పన్నును వేస్తున్నాము" అని చెప్పుతున్నారు అందరికీ కూడా Plan సక్రమంగా అమలుజరగాలని, ప్రభుత్వం ఏ ఇబ్బందికీ లోనుకాకూడదనే ఉంటుంది అందుచేతనే ప్రభుత్వం పెట్టిన బిల్లుల నన్నింటినీ ఒప్పుకుంటున్నాము అందువల్ల మరుసంవత్సరం ఇంకేదో కమిటీని ఎపుడో వేస్తామని చెప్పకుంటూపోతూ కమిటీని మాత్రం వేయకుండాఉంటే రైతులకు మనమీద నమ్మకంపోతుంది అందువల్ల ప్రతి సంవత్సరమూ 4 అణాలు పన్ను ఎక్కించేదానికంటే రాబోయే 4, 5 సంవత్సరాలలో సంవత్సరానికి ఎంత లోటు ఏర్పడుతుందో లెక్కలువేసి ఒకతూరే, ఒక సంవత్సరమే పన్ను వేస్తే "ఇంక ఎటువంటి పన్నులూ రావనే" ఒక నమ్మకమును మనం రైతులకు కల్పించవచ్చును అని నేను ముఖ్యంగా మంత్రిగారికి మనవిచేస్తున్నాను

రైతులకు పన్ను ఇచ్చేశక్తి ఉన్నదా లేదా అనేది ఆలోచించాలి మంత్రిగారు ఎప్పుడు మాట్లాడినా వారి భూములు, గోదావరి ప్రాంతములో ఇప్పుడు నీరు సమృద్ధిగా వచ్చేటట్లుగా ఇతర అన్ని ప్రాంతాలలోను అటువంటి సౌకర్యాలుంటాయనే దృష్టితో మాట్లాడడము న్యాయముకాదని మనవిచేస్తున్నాను వారి భూములు ఎంత సారవంతముగాయున్నాయో అట్లాగే అందరి భూములు గూడా సారవంతముగాయుండి ఎక్కువ బస్తాలు పండుతున్నాయని అనుకోకూడదని మనవిచేస్తున్నాను ఇపుడు నీటితీరువా విధిస్తున్నారు పండిన పంట మీద దానికి తగినట్లుగా యీతీరువ విధిస్తే బాగుంటుంది తీరువాలు పెంచేటప్పుడు 1½ రూ లకు మించకుండా చూస్తామని మంత్రిగారు అన్నారు గోదావరి తాలూకాలలో పదమూడున్నర రూపాయలేమి, ఇరువది రూపాయలు వేసినాకూడా ఇచ్చేందుకు సిద్ధంగా ఉన్నారని వారేచెప్పారు ఆ ప్రాంతాలలో అధిక పంటలు పండుతున్నాయి అక్కడ పదమూడున్నర రూపాయలు లిమిట్ దాటి అధికముగా పన్నులు తీసుకున్నా వారేమీ అనుకోరు కాని వరుసగా నెల రోజులపాటు నీటి మొఖమేచూడని కొన్ని ప్రాంతాలలో యీ పన్నులు పెంచడము న్యాయముగా ఉండదు అటువంటివాటిని సెలెక్టు కమిటీలో ఆలోచించి ఎగ్జంప్షన్ ఇప్పించాలని మంత్రిగారికి మనవిచేస్తున్నాను

వేపంజెరి నియోజకవర్గములోని కొన్ని విషయాలు మనవి చేస్తాను అక్కడ అనేక చెరువులున్నాయి. వాటికి ఎన్నాళ్ళనుంచో వర్షాలులేవు దేశ

మంతా వర్షాలు ఎక్కువగా పడి చెరువులు తెగిపోతుంటె మా ప్రాంతములో త్రాగడానికికూడా నీరులేదు ఈతీరువాలు విధించేటప్పుడు అటువంటి ప్రాంతాల వారికి కష్టములేకుండా చేయాలని మనవిచేస్తున్నాను పన్నులు అధికముగా కావాలంటే నీటితీరువ ఎక్కువ చేయాలంటే అక్కడి భూములకు నీరు పారే టట్లు చూడవలసిన బాధ్యతకూడా ప్రభుత్వముమీద ఉన్నది

మైనరు ఇరిగేషన్ పనులు కలెక్టరుల ఆధ్వర్యములో ఉన్నాయి వీటిని రెవిన్యూ మినిస్టరుగారు గాని, ఫుడ్ ప్రొడక్షన్ మినిస్టరుగారుగాని తీసుకొనవచ్చు ఉదాహరణకు ఒక చెరువు ఉన్నదనుకోండి, దానిలోనికి ఒక నదిలోనుంచి నీరు రావలసి ఉంటుంది అందుకు అక్కడ కాలువ ఉంటుంది గాని ఆనకట్ట ఉండదు కాని, ఆ చెరువులోకి నీరు ప్రవహించినట్లుగా లెక్కలలో ఉంటుంది కాబట్టి నీటి తీరువ కట్టవలసిందేనని మన బిల్లులో ఉపహరిస్తున్నారు ఆ చెరువుకు కాలువ ఉండినా అది ఏటినుంచి వచ్చే కాలవయైనా, క్రమముగా నీరు వస్తుందా లేదా అనే విషయము కూడా ఆలోచించవలెనని మనవి చేస్తున్నాను ఇకనుంచైనా నీటి తీరువలు, భూమి శిస్తులు మన రాష్ట్రములో, తెలంగాణాలోనూ, ఆంధ్రలోను - మొత్తం ఆంధ్ర ప్రదేశమంతా ఒకే విధముగా ఉండేటట్లు చేయుటకు తగినశ్రద్ధ తీసుకుంటారని నేను అనుకుంటున్నాను రైతులు అధిక పన్నులు చెల్లించాలని చాలా బాధ పడుతున్నారు యీ సంవత్సరం విధిలేక కొత్త పన్నులు వేసినా అవి యీ సంవత్సరానికే పరిమితి చేస్తున్నామని బిల్లులో చేరిస్తే బాగుంటుందని మనవి చేస్తున్నాను వచ్చే సంవత్సరములోపల ఒక కమిటీని నియమించి యీ పన్నులన్నీ ఒకే విధముగా ఉండేటట్లు చూస్తామని మంత్రిగారు చెప్పారు. అదే నిజమైతే యీ శిస్తులన్నీ కూడా ఒక్క సంవత్సరానికే వచ్చే సంవత్సరం యీ విధంగా ఉండదు, ఇంకో విధముగ వస్తుందని మేము రైతులకు చెప్పగలము యీ విషయమై మంత్రిగారికి ఏలాంటి ఆక్షేపణ ఉండదనుకుంటాను యీ పన్నులన్నీ రైతులమీద వేసేకంటే మనలోటును భర్తీ చేసుకోటానికి వేరే మార్గాలు చూడాలి. మనము అనేక ఖర్చులు చేస్తున్నాము మనము రైతుల దగ్గరనుంచి వసూలుచేసి ఖర్చుచేసిన డబ్బు అంతా సద్వినియోగము అయితే రైతు ఏమీ దుఃఖపడడు దుర్వినియోగమైతే రైతు చాలా కష్టపడతాడు. పి డబ్ల్యు. డిపార్టుమెంటు, ఎలెక్ట్రిసిటీ డిపార్టుమెంటు, హైవేస్ డిపార్టు మెంటు యీ మూడు డిపార్టుమెంటులలో ఎక్కువగా వేస్టేజి జరుగుతున్నది. యీ విషయాన్ని ఆర్థిక మంత్రిగారు చూడవలసియున్నది వారు యివన్నీ పట్టించుకోరు. మనకు ఎంత లోటున్నది క్రొత్త పన్నులు వేసి ఎంత రాబట్టాలి అనే ఆలో

చిస్తారుకాని వచ్చిన డబ్బంతా ఎట్లా ఖర్చవుతోంది, ఎంత దుర్వినియోగ మవుతుంది అనేది పరిశీలించి దుర్వినియోగము కాకుండా చేద్దామని ఎప్పుడయినా ప్రయత్నించారేమో గుండెమీద చేయివేసుకుని చెప్పమనండి యీ విషయము ప్రతి సంవత్సరం కూడా మనవి చేస్తున్నాను అయిన మంత్రిగారు పట్టించుకోవడములేదు క్రొత్త పన్నులు వేయడానికి మార్గాలు చూస్తారేగాని వచ్చిన డబ్బును సక్రమంగా ఖర్చు చేయాలి, అధికముగా ఖర్చు కాకుండా చూడాలి అనే ఉద్దేశము వారికిలేదు ఫైనాన్షియల్ మినిష్టరుగారు యీ విషయిములో తగిన శ్రద్ధ తీసుకొని అధికధనం దుబారా కాకుండా చూచుకుంటే క్రొత్త పన్నులు వేయవలసిన అవసరముండదు దుబారా లేకుండా చేసినట్లయితే సంవత్సరానికి ఒకటి, రెండు కోట్ల రూపాలయినా మనము నిలువ చేసుకోవచ్చు యీ ఘూడు డిపార్టుమెంటులలో అయ్యే దుబారాను తగ్గించవలసియున్నది అందుకు ప్రభుత్వమువారు ఒక కమిటీని వేసి దుబారా తగ్గేట్టుగా చేయవలసినదని మనవిచేస్తున్నాను యీ అవకాశము యిచ్చినందులకు అధ్యక్షులవారికి అభివందనలర్పిస్తూ విరమిస్తున్నాను

*శ్రీమతి లక్ష్మీకాంతమ్మ (ఖమ్మం—జనరల్). అధ్యక్షా, యీనాడు మన వెట్ ఎసెస్‌మెంటును ఇంక్రీజ్ చేయు విషయంలో చర్చించుకొంటున్నాము దీనిపైన చాలామంది సభ్యులు మాట్లాడారు ఇరిగేషన్ మీద ప్రభుత్వము చేస్తున్న ఖర్చులు పెరుగుతున్నా, అభివృద్ధి మినహాయించి ప్రత్యామ్నాయంగా నీటి తీరువ రేటు పెంచడం సమంజసమేనని నేను భావిస్తున్నాను ఐతే నీటి తీరువ రేట్లు పెంచేముందు అది నాలుగు సూత్రాలను శాటిస్‌ఫై చేయవలసిన అవసరమున్నది యీ నాలుగు సూత్రాలు తెలియచేస్తున్నాను తీరువ రేటు పమిటో సామాన్య రైతులందరికీ తేలికగా అవగాహన కావాలి తమ నుంచి వసూలుచేసుకొనే పన్ను సరయినదని తెలుసుకోవడానికి వీలుగాఉండాలి. అన్ని ఇరిగేషను పంటలకు సమానంగా వర్తించాలి గ్రూపులవారీగా అన్ని భూములకు సమానంగా చేయడానికి వీలుగా ఉండాలి ప్రభుత్వమువారు సులభంగా జమాఖర్చును తయారుచేయడానికి తనఖీ చేయడానికి అనువుగాఉండాలి. నిర్ణీతమైన తీరువ రేట్లకు యీ నాలుగు సూత్రాలు సరిపోగలవని రెవెన్యూ డిపార్టుమెంటులోని అనుభవజ్ఞులు చెపుతున్నారు. మన రెవెన్యూ మినిష్టరుగారు చెప్పిన ఎసెస్‌మెంటును చాలావరకు యీ నాలుగు సూత్రాలను వెట్ ఎసెస్‌మెంటు సంతృప్తిపరుస్తుందని నేను భావిస్తున్నాను యీ నాలుగుసూత్రాలను ప్రతి రాష్ట్రము కూడా ఆమోదించాలని పన్నుల దర్యాప్తు సంఘమువారు సిఫార్సు చేశారు. వాటిని కాదని ప్రస్తుతము ఉన్న రకరకాల రేట్లను

అమలుపరచడమే కాక వాటిని ఆధారంగా తీసుకొని ఒకేరకమైన నీటిపారుదల సౌకర్యాలు పొందుతూఉండి ఒకేరకమైన పంటలు పండించే రైతులలో మనం వ్యత్యాసాలను చూసినట్లయితే మనము వారిని అన్యాయంచేయడమేకాగలదు ఈ నీటితీరువ రేట్లను పెంచడంలో న్యాయం కూడా కొంత ఉందని చెప్పక తప్పదు ఒకదఫా నిర్ణయించిన రేటు శాశ్వతంగా ఉండాలనడం న్యాయంకాదు ప్రాజెక్టు నిర్వహణ ఖర్చు నీటి వనరులనుబట్టి మారుతూ ఉంటుంది ప్రాజెక్టుల నిర్మాణానికి పెట్టే పెట్టుబడులను బట్టి పన్నులు వస్తాయి కనుక తీరువ రేట్లను గురించి అప్పుడప్పుడు పరిశీలనలు మార్పులు జరుగుతూఉండాలి ఇరిగేషన్ సౌకర్యాలు పెరుగుతున్నకొలదీ రైతులు పండించుకొనే పంటలు కూడా పెరుగుతూండగలవు మైనరు ఇరిగేషన్—దుర్భిక్ష ప్రాంతాలలోనే కాక—ప్రాజెక్టుల విషయంలో కూడా వచ్చే మార్పులను పరిశీలనచేసి, పంచవర్ష ప్రణాళికవల్ల మార్పుచేయడం సహేతుకం కాగలదు దీనివల్ల ప్రభుత్వానికి హెచ్చు ఆదాయము వస్తుంది రైతులు ప్రభుత్వమునకుచెల్లించవలసిన సొమ్ము గురించి స్థిరత్వమనేది లేదు

ఈ wet assessment యింకా కొన్ని కారణాలవల్ల పెంచవలసి వచ్చింది మన బడ్జెటులో లోటు ఉన్నదనే విషయం అందరూ, ప్రతిపక్షాలవారు కూడా ఒప్పుకొన్నారు ఈ లోటు ఎందుకు వస్తున్నది? ప్రణాళికలో మనము చేసే పనులవల్ల వస్తున్నది ప్రణాళికలు ఆపవద్దని ప్రతిపక్షమువారుకూడ చెపుతున్నారు కలకత్తాలో జరిగిన ఒక సమావేశంలో కేరళ ముఖ్యమంత్రి శ్రీ నంబూద్రిపాద్ కూడ ప్రణాళికలు ఆపరాదని, కాని పన్నులు శక్తివంతుల మీద వేయవలెననే అభిప్రాయం వెల్లడించారు దానితో నేనుకూడ ఏకీభవిస్తున్నాను. పూర్వం, ప్రభుత్వం ఖర్చులు పెట్టేటప్పుడు remunerative and unremunerative schemes అని ఉండేవి unremunerative schemes మీద ఎక్కువ ఖర్చుచేసేవారుకాదు ఇప్పుడు రెండూ అమలు జరుపుతున్నాము కాబట్టి అదనపుపన్నులు వేయవలసిన అవసరం ఏర్పడింది నీటి పారుదల స్కీములక్రింద రైతులు అధికప్రయోజనాలు పొందుతున్నారు Regular గా assured water supply ఉన్నది. కాబట్టి ప్రభుత్వ నిర్వహణమునకు తోడ్పడటం న్యాయమని మనవిచేస్తున్నాను. ప్రతినిత్యం, ప్రతి ప్రాంతంనుంచి రైతులుగాని వారి ప్రతినిధులుగాని, వచ్చి నీటిపారుదల సౌకర్యాలు కల్గించాలని ప్రభుత్వాన్ని అడుగుట చూస్తున్నాము. అదనపు ఆదాయం లేకుండా ఈ స్కీములు ఎలా అమలు జరపగలమనేది ఆలోచించాలి అదనపురాబడి లేకుండా అదనపు సౌకర్యాలు లభించవు. ఇప్పుడున్న ప్రణాళికలు దృష్టిలో పెట్టుకొని చూచినా

వాటి maintenance క్రింద విపరీతంగా ఖర్చు అవుతున్నది సెంటరుకు యిచ్చే వడ్డీ చూచుకుంటేనే, చాలాసొమ్ము యీ విధంగా భరించుకోవలసి వస్తున్నది పన్నులు పెంచవద్దని చెప్పుట సుళువే పన్నులు వేసేవారిని ద్రోహులుగా చిత్రించటంకూడా చాలా సుళువు. రామరాజ్యం తెస్తామని ప్రజలమీద పన్నులు వేసి పీడిస్తున్నారనేది వింటూఉంటాము అయితే శ్రీరాముని ఒక statesmanగా వారు భావించిచూస్తే రామరాజ్యంలో కూడ పన్నులు ఉన్నవి రామరాజ్యంలో పన్నులు లేవనేది వట్టిమాట దీనికి ఒక చక్కనికథ ఉదాహరణగా చెపుతాను రాముడు అరణ్యావాసమునకు వెళ్ళినపుడు, భరతుడు 14 సంవవత్సరములు రాజ్యం చేయవలసివచ్చింది కాని ఆయన రామునివలె statesman కాదు కాబట్టి ప్రజలు ఆయనను మోసంచేశారు పైపంటలమీద పన్ను కావాలన్నప్పుడు వేరుశనగ మొదలైనవి వేసి రాజ్యాంగానికి కావలసిన పన్నులు ఎగగొట్టుతూ వచ్చారు రాముడు తిరిగివచ్చిన తరువాత ఖజానా అంతా ఖాళీగా ఉన్నదని చూచి, జరిగినసంగతి నంతా తెలుసుకొని ఆయన ఒక ఉపాయం పన్నాడు ప్రజలను పిలిపించి - ఒక్కొక్కరూ యిన్ని గుమ్మడికాయలు యివ్వాలని నిర్ణయించారు లేకపోతే గుమ్మడికాయంత బంగారమైనా యివ్వాలని అన్నారు.

సాంఘిక సంక్షేమ శాఖామంత్రి (శ్రీ డి సంజీవయ్య) గుమ్మడికాయలు పండించకపోతే ఏమిచేయమన్నారు

శ్రీమతి టి లక్ష్మీకాంతమ్మ అందరి దొడ్లలోను గుమ్మడికాయలు కావలసినన్ని ఉన్నవి ఇవ్వగలమని అందరికీ ధైర్యం ఉన్నది కాని వాటి నన్నింటిని హనుమంతుడు పాడుచేసినాడు మర్నాడుచూస్తే గుమ్మడికాయలు లేవు అప్పుడు, వారంతా యిదివరకు సేకరించిన బంగారమును ప్రభుత్వ ఖజానాకు చెల్లించవలసి వచ్చింది.

శ్రీ పి. వి. నరసింహారావు (మంథాని) - ఇది వాల్మీకి రామాయణములో ఉన్నదో, మరి ఏ రామాయణములో ఉన్నదో సెలవిస్తారా ?

శ్రీమతి టి లక్ష్మీకాంతమ్మ : వాల్మీకిరామాయణములో ఉన్నది. refer చేసుకొనవచ్చును అందువలన రాముడు దైవశక్తివలన చేయగలడని, రామరాజ్యంలో పన్నులు లేవనేది వట్టిమాట. ఏ ప్రభుత్వమైనా డబ్బులేనిది, పనులు చేయుట సాధ్యంకాదు. దీనికి ఎక్కువ వాగ్వివాదాలు లేకుండా, బాధ్యతాయుతంగా ఆలోచించి అన్నివర్గాలవారు ప్రభుత్వానికి తోడ్పడి ప్రణాళికాపనులు

జయప్రదంగా కొనసాగించాలని మనవి చేస్తున్నాను పన్నులను వ్యతిరేకించే వారు అభివృద్ధి కాముకులమని సంతృప్తి పడుతూంటారు ఇది సరైన దృక్పథం కాదు సక్రమంగా ప్రజాపరిపాలన కొనసాగాలంటే, సుస్థిర ప్రభుత్వవ్యవస్థ నెలకొల్పాలంటే అభివృద్ధి ప్రణాళికలు, అభ్యుదయ ప్రణాళికలు, అమలు జరపాలంటే ప్రజా సహకారంతోబాటు, ప్రజా ద్రవ్యంకూడా కావాలి. ఇందుకు ప్రయత్నం చేయుటలో అసహజం, అక్రమం, ఏమీలేదని చెపుతున్నాను పన్నులు వేయడంవల్ల unpopular అవుతారని కూడ అందరికి తెలుసు Popularity కావాలంటే పన్నులు లేకుండా చేసుకుపోవచ్చు కాని అదనపు అవసరాలు ఉన్నప్పుడు బాధ్యతగల ప్రభుత్వం పన్నులు వేస్తుందనేది గుర్తించు కోవాలి పన్నులు వేయకుండా మంచిని సంపాదించుకొనుట సులభమే కాని ప్రజాక్షేమమును దృష్టిలో పెట్టుకొని స్థిరమైన, ప్రణాళికాబద్ధమైన పురోగమ నానికి ఉపక్రమిస్తున్న ప్రభుత్వం అత్యవసరమైన యీ చర్యను తలపెట్టింది ఈ సందర్భంలో ప్రభుత్వాన్ని అందరూ ఏకగ్రీవంగా సమర్థించాలని కోరుతూ యింతటితో విరమిస్తున్నాను.

* శ్రీ బి శ్రీరామమూర్తి (విజయనగరం) అధ్యక్షా, ప్రభుత్వానికి బడ్జెటు లోటు ఉన్నది, ఈ లోటును భర్తీ చేయుటకు అదనంగా పన్నులు వేయాలి - యిది సామాన్య అభిప్రాయం కాని, ఉన్నటువంటి మొత్తములను ఏరకంగా ఖర్చు చేస్తున్నారు ? దానినిగురించి ఆలోచించాలి ప్రభుత్వానికి డబ్బు లేనప్పుడు, అందుకు మార్గములు చూపించమని అడుగుతారు కాని ఉన్నటువంటి మొత్తాన్ని ఏరకంగా ఖర్చు చేయాలనే విషయం సంప్రతించ నవసరము లేదు వారి యిష్టానుసారం ఖర్చుపెట్టడం జరుగుతున్నది. నిజానికి, పన్నులు చెల్లించాలనేది ఏ ఒక్కరూ కాదనరు. ఎవరూ వెనక్కి తీయరు కాని ఈ రోజున ఏ కారణంవల్ల వెనక్కు తీస్తున్నారనేది యోచన చేయవలసి యున్నది ఏ ప్రాంతంలో చూచినా ప్రజలకు కావలసిన పనులు ఏమైనా ప్రభుత్వం చేస్తున్నదా ? ఎక్కడా ఏమీ కనపడదు ఒక గ్రామంలో గట్టు కావాలి, నిర్మాణ సౌకర్యం కావాలి, అంటే దానికి ప్రభుత్వం పూనుకోవుట లేదు పన్నులు పెంచటానికి, ఆదాయం సంపాదించటానికి ప్రభుత్వం పూను కొంటున్నది. కాని ప్రజల తాలూకు అవసరాలు ప్రభుత్వం తీర్చలేకపోతున్నది ఒక గ్రామానికి రోడ్డు కావాలంటే, హాస్పిటల్ కావాలంటే, విద్యా సౌకర్యం కావాలంటే, ప్రభుత్వం ఎక్కడ ఉన్నదని ప్రశ్నవేస్తే కనపడదు.

[*Smt T Lakshmi Kantamma in the Chair*]

ఈ రోజున ప్రభుత్వం తలపెట్టిన క్రొత్త పన్నులు మా పార్టీతరఫున తీవ్రంగా ఖండిస్తున్నామని మనవిచేస్తున్నాను కేవలం పేద ప్రజల ప్రాణాలు తీసివేసే పరిస్థితులు తెస్తున్నారు ఒక సమయం లేకుండా నిరంతరం ప్రభుత్వం పన్నులు పెంచుతున్న పరిస్థితిని యావన్మంది గమనించాలని కోరుతున్నాను ఈ రోజున ఏ గ్రామానికి పోయినా పన్నులభారం పనికిరానని ఖండిస్తున్నారు మొన్న వెంకటరావుగారు చెప్పారు - "మీరంతా యువకులు, వేడిరక్తం ఉంటుందని" అన్నారు బాధ్యత లేకుండా మాట్లాడామని వారు అనుకుంటారు అదేరకంగా వారు పెద్దలని మేము అనుకుంటాం పెద్దలు అని అనడంలో మా ఉద్దేశం, ఛాందసంగా ఉంటారని, అభివృద్ధి మార్గం వ్యతిరేకిస్తారని కనుక ఈ పదాలు ఉపయోగించినందువలన ప్రయోజనం లేదు ప్రభుత్వ వ్యతిరేక పక్షాన ఉన్నందున, ప్రభుత్వాన్ని వ్యతిరేకించాలని కాదు పన్నుల భారం పనికి రాదని చెపుతున్నాము ప్రభుత్వంతో సహకరించటానికి కూడ ప్రతిపక్షం సిద్ధంగానే ఉంటున్నది కాని ప్రతిపక్షంతో సహకరించటానికి ప్రభుత్వం సిద్ధంగా లేదు. ఇది నిన్న స్పష్టమైనది - ఈనాం బిల్లు వచ్చినప్పుడు ప్రతిపక్షంనుంచి ఎన్నో సూచనలు చేశారు వాటి మంచిచెడ్డలు, సంగతి సందర్భాలు చూడకుండా, ఆలోచించకుండా, ప్రతిపక్షానికి, ప్రభుత్వానికి మధ్య అడ్డుగోడ పెట్టినట్లు వ్యవహరించిన సంగతి అందరికీ తెలుసు

అందువల్ల ప్రతిపక్ష సహకారమును ప్రభుత్వం కోరటంలేదని మనవి చేస్తున్నాను ప్రతిపక్షం ప్రభుత్వంతో ప్రతినిత్యం పోరాడవలసిన పరిస్థితి కల్పిస్తున్నారు. మేము కేవలం ప్రభుత్వంమీద వ్యతిరేకభావంతో కాదు యీ పన్నులను వ్యతిరేకిస్తున్నది నిత్యము ప్రజల జీవితం మీద యీ పన్నులభారం గొడ్డలి పెట్టుగా పరిణమిస్తున్నది అందుచేతనే మేము యీ పన్నులను వ్యతిరేకిస్తున్నాము. కేంద్ర ప్రభుత్వం కూడా పన్నుల భారాన్ని పెంచుతున్నది అంటే అది దేశంలో ఆర్థిక సమానత్వమును సాధించడానికి ఒక సూత్రంగా, ఒక పరికరముగా ఉపయోగపడుతున్నది కాని ఇక్కడ యీ పన్నులు ప్రవేశపెట్టటంలో ఏదైనా సూత్రం ఉందా, ఏదైనా సిద్ధాంతం ఉందా అని చూస్తే అటువంటిదేమీ లేదు. కేవలం పేదలమీద యీ పన్నులభారం పడుతున్నటువంటి పరిస్థితులు ఉన్నవి ఆర్థిక సమానత్వం సాధించడానికి, సాంఘిక న్యాయం సంపాదించటానికి యీ పన్నులు విధిస్తున్నారా అంటే లేదు. సామాన్య ప్రజల మీద పడుతూన్న భారాన్ని దృష్టిలో పెట్టుకొని మేము యీ పన్నులను ఖండించటానికి నిశ్చయించుకొన్నాము ఇప్పటికే అనేకరకాలైన పన్నులు ఉన్నాయి. "స్టాండర్డైజేషన్ ఆఫ్ ఎసెస్‌మెంట్" క్రింద పన్ను వేశారు

ఇనాములమీద రైత్వారీపన్ను నిర్ణయించారు ఎడ్యుకేషన్ సెస్సు అని ఉన్నది లోకల్ బాడీస్ సెస్సు ఉన్నది. స్పెషల్ చార్జెస్ ఆన్ కమర్షియల్ క్రాప్స్ ఇది వరకే ఉన్నది సర్ చార్జి ఇదివరకు కూడ ఉన్నది ఇది మళ్లీ పెంచుతున్నారు అదేవిధంగా సర్వేచేస్తున్న సందర్భంలో దానిమీద వేరే పన్ను ఉన్నది పంచాయితీబోర్డులున్నట్లయితే, అక్కడ ఇంటిమీద పన్ను ఉంటుంది బండిమీద పన్ను ఉంటుంది చెఱకుగానుగ మీద పన్ను ఉంటుంది అనేకరకాల పన్నులు ప్రజలమీద వేస్తున్నారు ఇదివరకు 30 సంవత్సరాల కొకసారి సెటిల్ మెంటు జరుగుతూఉండేది సెటిల్ మెంటు జరిగే కాలంలోనే పన్నులు పెంచటం ఉండేది సెటిల్ మెంటు జరగటం అంటే, పన్నులు పెంచటంగా ఉండేది ఆ రకంగా ప్రజలు భయపడవలసిన అవసరంలేకుండా ప్రభుత్వం సెటిల్ మెంటు ఆపుచేశారు కాబట్టి పన్నులు ఎప్పుడైనా వేయివచ్చును బడ్జెటు సమయంలో పన్నుల హెచ్చింపు ప్రతిపాదనలు చేయబడినవి అప్పుడు చేయకపోతే ఇంకోసారి చేయవచ్చును ఎప్పుడో అప్పుడు పన్నులు వేయవచ్చును ఏదో అదను తీసుకొని పన్నులువేస్తారు పన్నులు వేయటం మాత్రం మానటంలేదు ప్రభుత్వం పల్లం భూమిమీద 18¾ పర్సెంటు పన్ను పూర్వం పెంచింది అదేవిధంగా మెట్టభూమిమీద 25 వంతులు పెంచింది వీటిని తిరిగి పెంచటానికి ప్రభుత్వం ప్రయత్నం చేస్తున్నారు పెంచటమేకాదు ఒకటవతరగతి, రెండవతరగతి జలాధారంగా ఉన్నటువంటి చెరువులు ఇదివరకు మినహాయించబడినవి ఉంటే, ఇప్పుడు వాటికా మినహాయింపులు తొలగించబడతాయి 200 ఎకరాలకు మించినటువంటి రిజిష్టర్డు ఆయకట్టు ఉన్న చెరువులు కూడ మినహాయింపునుంచి తప్పుకొంటాయి అక్కడ ఉన్న ఆయకట్టుదారులు, రైతులు శిస్తు చెల్లించవలసినటువంటి పరిస్థితి ఏర్పడుతున్నది

ముఖ్యంగా శ్రీకాకుళం జిల్లాలో ఉన్న పరిస్థితులు దృష్టిలో పెట్టుకొని నేను మాట్లాడుతాను. గ్రామాలలోని చెరువుల మరమ్మతుకు ఇంతవరకు ప్రభుత్వం పూనుకోలేదు అక్కడి చెరువు గర్భం చెరువుగట్లు సమానమైన లెవెల్ కువచ్చి ఉన్నాయి ఇంతవరకు ప్రభుత్వం దానిని బాగుచేయించలేదు. "సిల్టుక్లియరెన్సు చేయలేని పరిస్థితిలో ప్రభుత్వం ఉన్నది, గతసంవత్సరం చేయలేదు, ఈ సంవత్సరం కూడా చేయబోము" అని అక్కడి ఎగ్జిక్యూటివ్ ఇంజనీర్ చెప్పారు ఎక్కడ చూసినా, పగిలిపోయిన గుండెల్లాగా ఎండిపోయిన పొలాలు కనబడుతున్నాయి. ప్రజలు నీరు కావాలని ఆకాశంకేసి చూస్తూంటే, వారి కళ్లనుండి నీళ్లు కారుతున్న పరిస్థితి ఉన్నది మైనర్ ఇరిగేషనుగురించి శ్రద్ధ వహించనటువంటి ప్రభుత్వం, చెరువులకు, కాలువలకు మరమ్మతులు

చేయించి సరైన స్థితిలో ఉంచనటువంటి ప్రభుత్వం, పన్నుల భారాన్ని పెంచినట్లయితే, ప్రజలు సహించరు ఆ పన్నులను ప్రజలు భరించలేరు ప్రతినిత్యం ప్రతిఒక్కరు ప్రభుత్వం తెచ్చే పన్నులభారాన్ని ప్రతిఘటించటానికి కృతనిశ్చయులై ఉన్నారు ఈ విషయం ప్రభుత్వం మరచిపోవటానికి వీలులేదు అంతే కాదు మేజర్ ఇర్రిగేషన్ స్కీములు ఉన్నాయి ఇదివరకే

"Provision is already made for levying water rates at a substantially heavy rate"

అని వారు వేసిన కరపత్రంలో వ్రాశారు మేజర్ ఇరిగేషన్ ప్రాజెక్టు అన్నట్లయితే హెచ్చు రేటు పన్ను విధించటం జరుగుతుందని చెప్పారు ఈరోజున ఒక ముఖ్య విషయం ఆలోచించాలి. వాటర్ రేటు మూడు రకాలుగా ఉంటోంది డ్రైలాండుమీద వాటర్ రేట్ వేస్తూంటారు "వాటర్ రేట్ ఆన్ సెకండ్ క్రాప్‌లాండు" రెండవ పంట పండించేటప్పుడు దానిమీద కూడా వాటర్ రేట్ వేయవలసి ఉంటుంది,

"Water rate is elementary in the case of wet land," అని దాని మీద కూడ పన్ను పెంచటం జరుగుతున్నది సామాన్యంగా డ్రైలాండు ఎసెస్‌మెంట్ అంతా చెల్లించవలసివస్తుంది డ్రైలాండుమీద ఉన్నటువంటి ఎసెస్‌మెంట్‌లాండ్ రెవిన్యూ అవుతుంది వెట్‌లాండ్‌మీద ఉన్న ఎసెస్‌మెంట్‌లో కాంపోనెంట్‌పార్ట్స్, లాండ్ రెవిన్యూ వాటర్ రేట్ రెండూ కలిసే ఉంటున్నాయి ఎంత పర్సెంట్ వాటర్ రేట్ ఉండాలి, ఎంత పర్సెంటు లాండ్ రెవిన్యూ ఉండాలి అన్నది ప్రభుత్వం నిర్ణయించవలసిఉన్నది ఇదివరకు 'ఆ కాంపొనెంట్ పార్ట్సు ఏమాత్రం' అని ఆలోచన చేసి, నిర్ణయం చేయలేదు 'ఏమాత్రం' అని ఊహించి ఇప్పుడు ప్రభుత్వం నిర్ణయం చేయవలసి ఉంటుంది వెట్‌లాండ్‌మీద ఉన్న శిస్తులో నూటికి 70 పాళ్లు నీటికోసం విధిస్తున్నటువంటి పన్నుగా ప్రభుత్వం నిర్ణయం చేశారు అంటే దాని అర్థం ఏమిటి? నూటికి 70 వంతులు ఇదివరకు నీటికోసం వసూలు చేస్తున్న పరిస్థితి ఉన్నది 18¾ పర్సెంటు ఇదివరకు పెంచి ఉన్నారు దానిని ఇప్పుడు రెండు రెట్లు చేసి, 37½ పర్సెంటు ప్రభుత్వంవారు చేయబోతున్నారు ఇస్తున్నటువంటి కొద్దిపాటి నీటిసదుపాయం కోసం ప్రభుత్వం అదనంగా, అధికంగా పన్నులభారాన్ని ప్రజలపైన వేస్తున్నట్లు స్పష్టమవుతున్నది ప్రజలకు వచ్చే కొద్దిపాటి ఆదాయంమీదనే కదా, ప్రభుత్వం పన్నులు వేసేది ఇదివరకే బెటర్‌మెంట్ లెవీ వేసిఉన్నారు. ప్రాజెక్టు ఏరియాలో, నీరు సప్లయి చేసినప్పుడు

అదనంగా చార్జెస్ వసూలు చేస్తున్నారు మెయిన్‌టెనెన్స్ కోసమే యీ చార్జెస్ వేయవలసి ఉంటుందని ఇదివరకు చెప్పాను టాక్స్‌యొక్క ఎలిమెంట్‌ను ఇంట్రడ్యూస్ చేస్తున్నామని మంత్రిగారు చెబుతున్నారు రైతుకు వస్తున్న స్వల్పమైన ఆదాయాన్ని మనం గమనించవలసి ఉన్నది ఈనాడు దేశంలో చాలా ప్రాంతాల్లో కరువు పరిస్థితులు ఉన్నవి వాటిమాట ఏమిటని మేము ఆందోళన పడుతున్నాము శ్రీకాకుళంజిల్లాలో చూసినట్లయితే చాలా ప్రాంతాలలో వర్షాలులేవు సెప్టెంబరు, అక్టోబర్ నెలలలో కూడ వర్షం పడలేదు ఊడ్పులు ఊడ్చిన ప్రాంతాలలో కూడ పంటలు చెడిపోయినవి ఈ పరిస్థితులలో "మాకు ఉన్న ఋణాలు ఏవిధంగా చెల్లించుకోవాలి, ప్రభుత్వం మాకు రిలీఫ్ మెజర్స్ ఏవైనా అమలు పరుస్తారా" అని ప్రజలు ఒకపక్క ఆలోచిస్తున్నప్పుడు, వారిపైన ఇంకా పన్నులు పెంచటానికి ప్రభుత్వం ప్రయత్నిస్తోంది నేను పన్నులను ఎంతప్రతిఘటించినా ప్రయోజనంఉండదు మంత్రిగారు ఏపరిస్థితులలోనైనా సరే పన్నులు వేయవలసిందే అంటే, మేము చేయకలిగింది ఏమీ ఉండదు ఎందుకంటె వారికి తగిన మెజారిటీ ఉన్నది వారికి కావలసిన బలం ఉన్నది ప్రస్తుతం పెద్దలు యావన్మంది అశోకుని తాలూకు ధర్మచక్రం చూపి పరిపాలన సాగిస్తున్నారు అశోకుడు తాను విజయం సాధించిన తర్వాత, శత్రువులను ఓడించిన తర్వాత, ప్రక్క రాజ్యాలను జయించిన తర్వాత, తన రాజ్యకాంక్షను వదలుకొన్నాడు అదేవిధంగా ప్రభుత్వంలో ఉన్న పక్షంవారు, యీరోజు అధికారంలో ఉండి మెజారిటీ సంపాదించినంత మాత్రాన, జబర్దస్తీతో, ఉన్నటువంటి బలాన్ని ఉపయోగించి, యీ పన్నులను విధించటం కాదు ప్రభుత్వం ప్రజల కష్టాలను చూడాలని కోరుతున్నాను యన్ జి ఒ. లు తమకు జీతం పెంచమంటే, మంత్రిగారు ఇదివరకు ఒక విషయం చెప్పారు "యన్ జి ఒ లు జీతాలు పెంచాలంటే ప్రజలమీద అధికంగా పన్నులు వేయాల్సి వస్తుంది అందుచేత వారికి జీతాలు పెంచేస్థితిలో ప్రభుత్వం లేదు" అని మంత్రిగారు చెప్పారు కాని యీనాడు వారు పన్నులు పెంచుతున్నప్పుడు యన్. జి ఒ ల జీతాలు కూడ పెంచుతారా? తమ ఉద్యోగస్థుల అవసరాలు తీర్చేందుకు ప్రజలమీద పన్నులుభారం పెంచేదానికి ప్రయత్నిస్తారా? బీద ప్రజలమీద పన్నులభారం పెంచటం ఎంత అన్యాయమో, తమ ఉద్యోగస్థుల జీతాలు పెంచకుండా ఉండటం కూడ అంత అన్యాయమే. 1954 నుండి ఇప్పటివరకు చూస్తే, యీ మూడు సంవత్సరాలలో నూటికి 62 వంతులు పన్నులు పెరిగినవి ప్రభుత్వం పన్నులు ఇంకా పెంచటానికి ప్రయత్నం చేసినట్లయితే, భరించలేనంత బరువును ప్రజల నెత్తినవేస్తే, ప్రజలు దానిని తిరస్కరించక తప్పదు ప్రభుత్వానికి నిలబడకలిగే

శక్తి ఉండదు, ప్రజల తిరుగుబాటు తప్పదు ఇది ప్రస్తుతం ఉన్నటువంటి పరిస్థితి సెలవు

* శ్రీ ఎస్. వి కె. ప్రసాద్ (చెన్నూరు) అధ్యక్షా, మంత్రిగారు యీ రోజున ప్రతిపాదించిన బిల్లుతో బాటు యిదివరకే notice యిచ్చినవి యింకను రెండు యితర బిల్లులు కూడ ఉన్నవి Surcharge Bill కాక యింకొక బిల్లు కూడ ఉన్నది ఈ మూడు బిల్లులవల్ల గ్రామాలలోఉండే వ్యవసాయముచేస్తున్న ప్రజల పైన అదనంగా పన్ను పడుతుందన్నమాట అందుకనే ఏ ఒక్కదానిపైన మాట్లాడవలెననేది చాలా చిక్కుగా ఉన్నది ఎందుకంటే యిప్పుడు తెలంగాణాలో ఉన్న Agriculture Incomtax ను గురించిన బిల్లును ఒకదాన్ని రద్దు చేశారు కాని వారు అక్కడ ఇప్పుడు వేస్తున్న Surcharge మట్టుకు మొత్తము మీద ఆంధ్రప్రదేశ్ అంతటిలోకి అని కాకుండ తెలంగాణలో మాత్రము దాన్ని తీసివేసి, ఒక్క ఆంధ్రప్రాంతమునకు మాత్రమే అది వర్తించేటట్లుగా వచ్చే బిల్లు సరైన రూపములో రావడములేదు ఈ బిల్లులు అన్నింటికంటే మొత్తము అన్ని విషయాలు ఒకేసారి ఆలోచించి, బిల్లుతెస్తే land taxation విషయములు అన్నీ సమగ్రంగా చర్చించటానికి అవకాశముఉండేది. ఆ విధముగ రానప్పుడు మొట్టమొదట wet assessment ను గురించిన బిల్లుపైన కొన్ని విషయములు నేను చెప్పదలచుకున్నాను ఈ పన్ను వ్యవసాయము చేసుకునేవారి పైన గూడ పడుతున్నది. మామూలుగ నాలుగు, అయిదు ఎకరాలు మాగాణిభూమి ఉండి, వ్యవసాయము చేసుకుంటున్నవారి పైననే యిది అదనముగ పడుతున్నది ఇదివరకు ఉన్న మొత్తము opposition సభ్యులు, యింకా యితరులు అందరూ కూడ ఇప్పటికి చాలా కాలము నుంచి నెలకు నూరు రూపాయలు ఆదాయము వచ్చే ప్రజానీకముపైన పన్ను వేస్తున్నారు, వారికి యిప్పటికే పన్నుభారము ఎక్కువ అయింది, వారు మోయలేకుండ ఉంటున్నారు, అలాంటి పరిస్థితులలో వారిపైన యింకా పన్నులు వేయవద్దు అని చెప్పడము జరుగుతూవచ్చింది భూమి శిస్తు, యింకను యితర రూపములో వచ్చే ఆదాయముపైన వేయనున్న యీ కొత్త tax విషయము చూస్తే యిలాంటి మార్పు ఎక్కడ ఏ బిల్లు వచ్చినప్పటికీ కూడ, ఒకదానిలో మటుకు పదిరూపాయలు శిస్తుకట్టేవారి విషయములో మినహాయింపు చేస్తామని చెప్పినప్పటికినీ, అది ఒక్కటి చాలదని కనీసము నెలకు నూరురూపాయలు అంటే సం నకు 1200 రూపాయలు ఆదాయము వరకు వచ్చేవారిని మినహాయించడముకోసము ఏ బిల్లులోనూ, ఏ విధముగాను అవకాశము కన్పించడములేదు. దాన్నిబట్టి మొత్తముమీదచూస్తే agricultural income పైన, యింకను యితరరూపములలోకూడ వచ్చేటటువంటిఆదాయము

పైన, అన్నింటినీ చేర్చి లెక్కకు తీసుకుంటే, మామూలు రైతాంగము మీద హెచ్చు పన్ను పడటానికి కూడ అవకాశము కన్పిస్తున్నది అందువల్ల ఆరూపములో నైనా సరే కొంత ఎక్కువ భూమి ఉన్నవారిపైన పడేదేకాకుండ ఒక ఎకరము దగ్గరనుంచి, రెండు, మూడు, నాలుగు, అయిదు ఎకరాలు యీవిధముగ కొద్దిగా భూమి ఉండి వ్యవసాయముమీద ఆధారపడి జీవిస్తున్నవారిపైన కూడ అదనపు పన్ను పడుతున్నదన్నమాట

ఈ పన్ను తెలంగాణా ప్రాంతానికి మినహాయిస్తామని అంటున్నారు తెలంగాణ ప్రాంతములో ఉన్న భూమి రేట్లు అన్నిచోట్ల కంటే గూడ జాస్తిగా ఉన్నవి. దీనిని పరిశీలించి ఒక రూపములో తీసుకొనిరావటానికి ఒక కమిటీని వేస్తామని మంత్రిగారు చెబుతున్నారు ఆ కమిటీని ప్రభుత్వమువారు ఎప్పుడు వేస్తారో, వారు అన్ని విషయములు, ఎక్కడెక్కడ ఏ విధమైన రేట్లలో పన్ను వేయబడుతున్నదో, అది అన్నీ గూడ విచారించి రిపోర్టు ప్రభుత్వానికి పంపేది ఎప్పుడో, దాన్ని ప్రభుత్వము పరిశీలించి ఒక నిర్ణయానికి ఎప్పుడు వస్తారో, తెలియదు కాని అది ప్రస్తుతములో వచ్చేటట్టు నేనే ఊహించటము లేదు తెలంగాణాలో ఉన్న తరిభూమికి వేస్తున్న రేట్లు చాలా హెచ్చుగా ఉన్నవని అందరికీ విశదమైన విషయమే ఎందుకంటే ఇక్కడ తెలంగాణలో ఉన్న వ్యవసాయ పద్ధతులు, నీటి పారుదల సౌకర్యాలు, వగైరాలు చూస్తే చాలా బలహీనముగాను, తక్కువగా సౌకర్యములు ఉండడము ఉన్నది ఆంధ్ర ప్రాంతములో మొత్తము పంటపండే భూమిలెక్క వేస్తే ఆంధ్రలో 30 6% తర ఉన్నప్పుడు తెలంగాణ ప్రాంతములో 17% వరకే ఉన్నది ఇక్కడికి అక్కడికి నీరు పారుదల సౌకర్యాలు మాగాణి భూమి విస్తీర్ణము విషయములోను చాలా తేడా ఉన్నది ఆంధ్ర ప్రాంతములో కాలవలద్వారా నీటి పారుదల సౌకర్యాలు 14 6% ఉంటే, తెలంగాణ ప్రాంతములోని సౌకర్యాలు 2 2% మాత్రమే ఉన్నవి ఇలాంటి పరిస్థితులు ఉంటున్నప్పుడు తెలంగాణ ప్రాంతములో భూమిపైన వేసే శిస్తు ఆంధ్రకంటె ఎన్నో రెట్లు ఎక్కువ అని అంటున్నాను తెలంగాణలో పన్నుల భారము విపరీతముగ ఉన్నట్లు దృఢపడుతున్నది ఇదిగాక ప్రభుత్వంవారి లెక్కల ప్రకారమే మరికొన్ని వివరాలు చెబుతున్నాను ఆంధ్ర ప్రాంతములో మాగాణి భూములకు maximum rate రు 14-4-0 ల నుంచి రు 6-8-0 ల వరకు ఉన్నది Maximum average rate రు. 3 0-0 ల నుంచి ఎనిమిది అణాల వరకు ఉన్నది కాని తెలంగాణలో చూస్తే maximum average rate రు. 22-0-0 ల నుంచి రు 16-0-0 ల వరకు ఉన్నది Minimum rate రు 17-0-0 నుంచి రు 8-0-0 ల

వరకు ఈ రేట్లు అన్నీ సమన్వయపరచటానికి ప్రభుత్వమువారు కమిటీని వేయబోతున్నాము, అంతవరకు యిప్పుడు ఉన్న రేట్లు అధికముగ ఉన్నను, అవే వుంచబోతాము అని మంత్రిగారు చెప్పినదాన్నిబట్టి రేట్లు ప్రస్తుతములో మారవని స్పష్టమగుచున్నది అంతేకాకుండ యీ additional wet assessment వేయడముద్వారా పెరిగేటటువంటి maximum average rates కూడ రు 13-0-0 ల పైచిలుకు, అంతకంటే మించకూడదు అని చెబుతున్నారు కాని తెలంగాణలో యీ తరిరేట్లు చూస్తే అత్యధిక భాగము ఏది అయితే maximum అవుతుందో అంతకంటే పెంచము అని చెప్పారు అక్కడినుంచే అసలు ప్రధానంగా single crop కు ఉన్న wet rates తెలంగాణలో మామూలు రేట్లే ప్రారంభము అవుతున్నవి ఇప్పటికే తెలంగాణాలో సామాన్యరైతాంగము, తరిభూమి ఉన్న రైతాంగము యింత అదనపు పన్ను భారమును మోస్తున్నారు ఈ అదనపు రేట్లనుంచి విముక్తి చెందటానికి రైతాంగము ఎదురు చూస్తున్నారు గనుక ప్రభుత్వమువారు వేస్తామని అంటున్న కమిటీని ఎప్పుడు వేస్తారు? అది అన్ని విషయములు పరిశీలించి రిపోర్టు ఎప్పుడు submit చేస్తుంది? ఆంధ్రలోనివి, తెలంగాణలోనివి integrate చేసేటట్లయితే, అప్పుడు దానిపైన నిర్ణయించే పన్ను విధింపుకు మరల పన్నుల బిల్లును ఎప్పుడు తెస్తారో ఎవ్వరికినీ తెలియని విషయముగ కన్పిస్తున్నది దీనిని బట్టి మొత్తముమీద మాలో కొందరికి దీనికి అర్థము ఏమి కనబడుతున్నదంటే, తెలంగాణవారికి యీ tax వేయడములేదని, ఇకపైన గూడ వారికి పెంచము అంటున్నారు. ఈ విధముగా చెప్పడము బహుశ ఏదో తెలంగాణవారి కన్నీరు తుడవటానికి చెప్పే మాటగా ఉన్నదని మేము అర్థము చేసుకుంటున్నామే గాని, వేరొకటి కన్పించడములేదు ఎందువల్లనంటే, ఎప్పుడైతే ఆంధ్రలో అదనపు టాక్సు వేసినప్పటికీ కూడ దీనికి 13 రూపాయలకు పైగా పెంచమని అంటున్నారో, కనీసము అదే రేటుకు తెలంగాణవారికి గూడ ఎందువల్ల తగ్గించకూడదు? ఇప్పుడు ఆ చట్టాలు, ఆ details లోకి పోవాలంటే సాధ్యముకాని పని తెలంగాణలోని చట్టములు, ఆంధ్రలోని చట్టములు యీ విషయమునకు సంబంధించినంతవరకు తిరగవేయాలంటే, అది ఇప్పుడు నాకు సాధ్యముకాని పని కాబట్టి ఏదైనా చేయవచ్చు ఇప్పుడు అదనపుపన్ను ఏదైనా వేయాలని అనుకుంటే, యీ సెషన్‌లో దాదాపు తొమ్మిదో, పదో బిల్లులు తీసుకునివచ్చి, యింత తొందరలో ప్యాసుచేయాలని rush చేస్తున్నారు. కాని యీ విధమైన అధిక పన్నులు వేయడము నైజాము హయామునుంచి వస్తున్నది. అప్పటినుంచి ప్రజలు భరిస్తున్నారు. ఇకమీదట ఏ మాత్రము యీ

పన్నుల భారమును మోయలేకుండా ఉన్నారు కనుక యికమీదట అయినను వీటిని తగ్గించటానికి అవసరమైన చర్యలు ప్రభుత్వం వెంటనే ఎందుకు తీసుకో కూడదు ? దానికి యింకను నాలుగు రోజులు, పది రోజులు అవసరమైనను, యీ సెషనును పొడిగించి అయినా సరే దానికి తగిన శాసనాన్ని చేయటానికి అవకాశము ఉండగలదు దీనికి ప్రభుత్వం పూనుకోవడములేదు ఈ విషయమును దాటివేయటానికి ఏదో కమిటీని వేస్తామని మంత్రిగారు చెబు తున్నారు అంతేకాదు యీ పన్ను తెలంగాణ ప్రాంతములో కొన్నికొన్నిచోట్ల విపరీతముగా హెచ్చు రేట్లు ఉన్నవి జాగీరు ప్రాంతాలలో వేరు, రైత్వారీ ప్రాంతాలలో వేరు రేట్లు ఉంటున్నవి ఈ రేట్లు అన్నీ సమన్వయపరచడము అవసరము మెదక్ జిల్లాలో నరసాపూర్ అనే ప్రాంతము ఉన్నది అక్కడ పెద్ద జాగీరు ఉండేది అక్కడ 18 రూపాయలనుంచి 30, 32 రూపాయల రేటు single crop గల తరి భూమికి ఉన్నది దానిని ప్రభుత్వము స్వాధీనము చేసుకున్నప్పటికినీ యింతవరకు ఆ భూములను రైత్వారి రేటు క్రిందకు తీసుకుని రాలేదు ఇలాంటి ఉదాహరణలు యింకా ఎన్నోఉన్నవి ఇలాంటి పరిస్థితులలో తెలంగాణాలో తరికి రేటు తగ్గించడానికి ప్రభుత్వం ఏ మాత్రము ప్రయత్నించ కుండా, యింకా కొంతకాలము ఆగండి అని చెప్పడం సరైన పద్ధతి కాదు ఇక పోతే రెండవవిషయము సర్చార్జీ బిల్లులో స్పష్టముగా ఉన్నది ఈ అదనపు తరి రేట్లు యిస్తున్న రైతులు పేదవారుగా ఉన్నారు ఇప్పుడు ఉన్నదానిమీద యింకను additional surcharge వేస్తామని యీ బిల్లు తీసుకునివచ్చారు అందువల్ల ప్రభుత్వము తెలంగాణలో ఉన్న తరి రేట్లు తగ్గించటానికి ఆలోచించ వలసిందిగా కోరుతున్నాను ఇప్పుడు యీ బిల్లును సెలెక్టు కమిటీకి పంపుతా మని అంటున్నారు సెలెక్టు కమిటీలోనైనా ఆంధ్రకు, తెలంగాణకు యీ రేట్లు సమన్వయపరిచేటట్లు ఒక సమగ్రమైన బిల్లును తయారు చేయించవలసిందిగా మంత్రిగారిని కోరుతున్నాను.

తెలంగాణాలోనున్న జాగీరు ప్రాంతాలలోని యింకా 1, 2 విషయాలు మంత్రిగారిదృష్టికి తేవాలనుకొంటాను కొన్ని ప్రదేశాలలో జాగీరు రోజులలో వున్నటువంటి శిస్తు బకాయిలున్నాయి జాగీర్దారులు వదిలిపెట్టేసినా ప్రభుత్వం మట్టుకు యింకా ఆ బకాయీలను వసూలు చేయడానికి ప్రయత్నం చేస్తున్నారు. జాగీర్దార్లకు లేనటువంటి హక్కులనువయోగించుకొని అదనపురేట్లు విపరీత ముగా ప్రభుత్వంవారు వసూలు చేస్తున్నారు. రజాకార్లకాలంలో చెల్లించిన రసీదులు రైతుల చేతులలో లేనందువల్ల పాతబకాయిల పేరిట ప్రభుత్వం శిస్తు వసూలుచేస్తున్నది ఎన్ని విజ్ఞప్తులు చేసినా లెక్కచేయక పశువులను జప్తుచేసి

7

రైతులనుండి నిర్బంధంగా శిస్తు వసూలు చేస్తున్నారు ఇటు అదనంగా వేసిన పన్ను లెక్కచూడకుండా దీనిని వసూలు చేయడంకోసం ప్రయత్నం చేస్తున్నారు జాగీరు ప్రాంతంలోనున్న యీ పరిస్థితిని ఆలోచించాలని మరొకసారి ప్రభుత్వ దృష్టికి తీసుకువస్తున్నాను ఈ మూడు బిల్లులపై ఆలోచించేటప్పుడు తెలంగాణాలో wet-rate ఎక్కువగా వున్నవిషయం ఆలోచించి వాటిని యీ సందర్భంలో తగ్గించడానికి ప్రయత్నించాలని మంత్రిగారికి అధ్యక్షులవారిద్వారా విజ్ఞప్తిచేస్తూ ముగిస్తున్నాను

శ్రీ ఆర్ వి వి. కృష్ణంరాజ బహదూర్ (తువి) అధ్యక్షా, ఈ రోజున గౌరవ నీయులైన రెవిన్యూ మంత్రిగారు సభముందు ప్రతిపాదించిన 1957 ఆంధ్ర భూమి శిస్తు అదనపు wet assessment బిల్లును నేను బలపరుస్తూ అందులో కొన్ని విషయాలను గురించి మాత్రం ప్రభుత్వ దృష్టికి తీసుకు వస్తున్నాను మన పరిపాలనా నిర్వహణ సందర్భంలో ఆర్థిక మాంద్యాన్ని తొలగించి దేశమును పురోభివృద్ధి మార్గంలో తీసుకుపోయే సందర్భంలో ఎక్కువగా ధనం సేకరించాలి ప్రస్తుతం మనది లోటు బడ్జెటు ఆ లోటును భర్తీ చేయుటకు కొన్ని పన్నులద్వారా ధనం సేకరించి తద్రూపేణా దేశాన్ని సస్యశ్యామలం చేయాలనే ఉద్దేశ్యంతో యీ బిల్లు ప్రతిపాదించారు కనుక దానిని నేను బలపరుస్తున్నాను వర్తమానంలో గోదావరిడెల్టా, కృష్ణాడెల్టా ప్రాంతాలలో నీరు సక్రమంగా పుష్కలంగా సరఫరా అవుతుంది అందుచేత ఆ ప్రాంతాలలోని వారు ఏ అదనపు పన్ను వేసినా భరించే అవకాశంవుంది దానికి తార్కాణంగా యీ రోజున గౌరవనీయులు మంత్రిగారే శలవిచ్చారు వారి చిన్నతనంలో పది బస్తాలు పండితే యీరోజు 20 బస్తాలు పండుతున్నదని చెప్పిన కారణంగా ఆ డెల్టా ప్రాంతాలలో యీ పన్నులు వేయడం సహజము, సందర్భము అని మనవి చేస్తున్నాను అయితే ప్రస్తుతం శ్రీకాకుళం. విశాఖపట్టణం, తూర్పు గోదావరి జిల్లాలలోని upland areas లో జమీందారీ ప్రాంతాలలో చెరువులుగాని, కట్టడాలుగాని సక్రమంగా మరమ్మత్తు కాని కారణంగా అక్కడున్న రైతు లీ అదనపుపన్ను భారాన్ని మోయలేరని ప్రభుత్వదృష్టికి తీసుకువస్తున్నాను ఎందుచేతనంటే, సమయానుకూలంగావర్షాలు కురిసినా చెరువులకు silt పట్టి పూడ్చుకుపోయిన కారణంచేత నీరు సక్రమంగా ఉండడంలేదు. ఈ సంవత్సరం వర్షాలులేక మెట్టపైరులు, వరి మాగాణి పైరులు కూడా పూర్తిగా పాడయిపోయిన సంగతి అందరికీ తెలిసినదే, అంతేకాకుండా యీ మధ్యనే minor inam క్రింద రైతులుకట్టే quit rent, జోడీ ఎకరానికి 0-12-0, 0-10-0 వుండే సందర్భంలో ఇప్పుడు రైత్వారీ రేటుకు తీసుకు

వచ్చాము రైత్వారీ రేటుకి రావడంతోటె అక్కడవుండే తరం రేటు చొప్పున ఎకరానికి 4, 5, 10 రూపాయలు చొప్పున శిస్తు పడింది తిరిగి ఈరోజున యీ బిల్లుద్వారా అదనంగా పన్ను వేస్తున్నాంఅంటే ఎకరాకి రు 0-12-0, రు 0-10-0 quit rent కట్టే రైతులు ఎంత ఆదుర్దాపడతారో ఆ విషయాన్ని కూడా గుర్తించవలసినదని ప్రభుత్వానికి మనవి చేస్తున్నాను అంతేకాకుండా ప్రస్తుతం precarious sources లో వుండే చెరువులు ఆధారమైన భూమిపైననూ, pump set లను ఉపయోగించే ప్రాంతాలపైననూ యీపన్ను వేయడం న్యాయం కాదని మనవి చేస్తున్నాను అయితే 200 ఎకరాలను మించే చెరువు ప్రాంతానికి కూడా యీ assesment తీసుకవస్తున్నాం అని చెప్పారు అది మంత్రిగారు జాగ్రత్తగా యోచించే విషయమని మనవి చేస్తున్నాను 200 ఎకరాలకు మించిన చెరువులు జమిందారీ ప్రాంతంలో upland area లో చాలా వున్నమాట వాస్తవం అవి చాలా బేచిరాకుగావుండి మరమ్మత్తు లేకుండా వున్నాయి అంతేకాకుండా ఆ చెరువుక్రింద పండేపంట ఎకరానికి 6 బస్తాలు 5 బస్తాలు కంటె ఎక్కువ పండడంలేదు అట్టి పరిస్థితులలో 200 ఎకరాలకు మించివున్న సందర్భంగా మేము యీ assessment లో కలుపుతాం అనే విషయం కొంచెం విశాల హృదయంతో చూడవలసి వుందని. తమద్వారా మనవి చేస్తున్నాను "ప్రస్తుతం డబ్బులేదు, పన్ను వేస్తున్నాం" అని చెబుతున్నారు K C Canal సందర్భంలో 8 కోట్ల రూపాయలు ఖర్చు చేశారు కాని 300 ఎకరాలు కూడ సాగులోనికి రాలేదు అదే రూపంలో కొన్ని కొన్ని కట్టడాలలో డబ్బును ఖర్చు పెట్టారు తత్ఫలితముగా లోటు బడ్జెటు వచ్చిన సందర్భం అందరికీ తెలిసినదే కాని నేను తమద్వారా ప్రభుత్వంతో మనవి చేసేది యేమిటంటే - తూర్పుగోదావరి జిల్లాలోని upland area లో చిన్న చిన్న చెరువులు, చిన్న చిన్న నదులు వున్నాయి పంపానది, తాండవ, వరాహా నదులున్నాయి ఇలాంటి నదులకు తక్కువ డబ్బుతో కట్టలు కట్టించితే, లక్షలాది ఎకరాల భూమి సాగులోకి రావడం, తద్రూపేణా ప్రభుత్వంవారికి భూమి శిస్తు పెరగడం, తద్వారా బడ్జెటు లోటు తీరడం జరుగుతుందని మనవిచేస్తున్నాను. ఆనకట్టలు లేనందువల్ల యీ చిన్ననదులలోని నీరు సముద్రంలోకి వృధాగా పోతున్నది. శ్రీకాకుళం, విశాఖపట్నం, తూర్పు గోదావరి జిల్లాలలోని uplands ప్రాంతానికికూడా డెల్టాప్రాంతాలపై వేసినట్లు అదనపు పన్నులు వేయడం కేవలం శోచనీయం. ఆ విషయం దృష్టిలో పెట్టుకొన్నప్పుడు 200 ఎకరాల ఆయకట్టును మించని చెరువులను యిందులో కలపడం న్యాయంకాదు తునితాలూకాలో తొండంగిప్రాంతం వుంది. అక్కడికి

తాండవ, పంపానదుల వల్ల నీరు సరఫరా అవుతుంది కాని అది సముద్ర ప్రాంతం కావడంచేత saline lands అవడంచేత పుష్కలంగా నీరున్నప్పటికీ తగినంత పంట రావడంలేదు అంతేకాకుండా అక్కడ వుండే pump set ల ద్వారా వర్తమానంలో వారు వ్యవసాయం సాగుచేసుకుంటున్నారు అలాంటి ప్రాంతాలలోని భూములపై కూడా అదనపు పన్ను వేయడం న్యాయంకాదని ప్రభుత్వ దృష్టికి తీసుకువస్తున్నాను శ్రీ బాటం శ్రీరామమూర్తిగారు చెప్పినంత ఘోరంగా పరిస్థితివుందని నేను వారిలాగ ఘోరంగా విచారించలేను ప్రస్తుతం బీదరైతులపై పన్నుల భారం హెచ్చుగా వుందని చెప్పారు "ఎంత చెట్టుకు అంత గాలి" అన్నట్లు ప్రతి రైతుకు కష్టనష్టాలుంటాయని గుర్తుంచుకోవాలి బీద రైతాంగం క్రుంగి కృశించిపోతున్నారనీ, పన్నులు హెచ్చయిపోయినా యని చెప్పారు ఈరోజున దేశవ్యాప్తంగా పురోభివృద్ధిని కోరుతూ, దేశాన్ని ముందుకు తీసుకుపోవాలి, వారికి ఆర్థికస్థోమత చేకూర్చాలి, దేశంలోని ప్రతివారికి పనిపాటలు చూపించాలి, రోడ్లు వేయించాలి, అన్ని రంగాలలో ముందుకు పోవాలంటే గారడీవాడు మామిడిమొక్క చూపించి పండు పండించే మాదిరిగా డబ్బు ఎక్కడనుంచి వస్తుంది? అందుచేత పన్ను వేయకూడదనే ఉద్దేశ్యంతో నేను మాట్లాడడంలేదు పన్ను వేయవచ్చును వేసే సందర్భంలో ఎలా వేయాలి? ఏ ప్రాంతంలో ఎంత పంట పండును? అన్నిటి పర్యవసానం యేమిటి? నీటి సరఫరా ఎట్లు వస్తుంది?

*[ Mr Speaker in the Chair ]*

అనే విషయాలను విశాల హృదయంతో ఆలోచించాలి **quality of the land** చూడాలి **quantum of yield from the acre** చూడాలి, **water facilities** చూడాలి, **nearness of the market** చూడాలి ఇవన్నీ చూసి రైతు భావిని సక్రమంగా తెలుసుకుని తద్రూపేణా పన్ను వేయాలి అట్లుకాక ఏదో **level** లో వేయకూడదు. వర్తమానంలోని ఆర్థికమాంద్యాన్ని గుర్తుంచుకుని, మెరక ప్రాంతం, పల్లపు ప్రాంతం, డెల్టాప్రాంతం, **precarious sources**, చిన్న నదులు, వీటన్నిటి పైనా ఒకేస్థాయిలో వేస్తాం అంటే రైతులు చాలా కష్టాలు పడతారు. "ఒకసారి అనుకున్నాం, బిల్లు పెట్టాం, వెనుకడుగు వెయ్యం" అనే వుద్దేశ్యం పెట్టుకోకుండా మనం సెలెక్టు కమిటీలో ఈ బిల్లును సాకల్యంగా చర్చించి, అన్ని స్థాయిలు తెలుసుకుని అన్ని రంగాలలో అందరికీ అందుబాటులో వుండే పన్నులు వేసి సంతుష్టికరంగా చేసుకుని పరిపాలన నిర్వహిస్తూ సక్రమస్థాయిలో తీసుకు వెళతారని ఆశిస్తూ ఇంతటితో నేను విరమిస్తున్నాను.

* శ్రీ పి శ్రీరాములు (దుగ్గిరాల) అధ్యక్షా ! ఈరోజు రెవిన్యూమంత్రి గారు ప్రవేశపెట్టిన ఈ wet assessment బిల్లును, కారణాలను చూపి సమర్థించ వీలులేకపోయినా, అవసరాన్నిబట్టి నేను సమర్థిస్తున్నాను మంత్రిగారు వారి ప్రారంభ ఉపన్యాసములో ఈ బిల్లును తీసుకురావలసిన అవసరాన్ని వివరిస్తూ ఆంధ్రప్రదేశ్ అంతట, అన్నిచోట్ల ప్రతినదిక్రింద సాగుచేసే భూములన్నిటికి ఒక విధమైన consolidated wet rate ఏర్పాటు చేయాలని, ఒకేనీటితో పండించే భూమిమీద ఒక ప్రాంతములో ఎక్కువ, ఒక ప్రాంతములో తక్కువ వుండటం న్యాయంకాదు కాబట్టి ఎక్కువవున్న ప్రాంతాలతోపాటు తక్కువ వున్న ప్రాంతాలలో పెంచవలసిన అవసరం ఆర్థికపరిస్థితులదృష్ట్యా ఏర్పడిందని చెప్పారు అది యథార్థమైన విషయమే శాంక్షన్ చేయబడి అమలులోవున్న ప్రాజెక్టులు, కొత్తగా శాంక్షన్‌చేస్తున్న ప్రాజెక్టులు వీటివల్ల నీటివసతిని పొందుతున్న ప్రాంతములకు 10 సంవత్సరాలక్రిందట ఏర్పడిన ప్రాజెక్టులక్రింద ఇవ్వబడిన నీటివసతిక్రింద సాగుచేసుకొనే పొలాలకు తేడా 25 సంవత్సరాల క్రితం ఎంతవున్నదో ఇప్పుడు అంతేవున్నది నాగార్జునసాగర్ ప్రాజెక్టుక్రిందగాని మరో ప్రాజెక్టుక్రింద కాని, భూములకు నీటివసతి కల్పించి, ఈ వసతితోపాటు మురుగు పారుదల పథకాలను అమలు జరుపుతున్నారు. కాని పాత డెల్టాల ప్రాంతములలో, ఇర్రిగేషన్ డిమాండులు వచ్చినప్పుడు, బడ్జెటు సమావేశములలో జరిగిన చర్చలలో కూడ ఈ వసతి కల్పించాలని పదేపదే కోరాము మురుగు పారుదల సౌకర్యాలు లేక పాతడెల్టాలలోని ప్రాంతములు మునిగి పోతున్నవి కాని ఈ మురుగుపారుదల సౌకర్యాలు కల్పించేస్థితిలో ఈప్రభుత్వం లేదు అధికవర్షాలవల్ల దెబ్బతిన్న ప్రాంతాలవారు రెమిషన్ ఇవ్వాలని ప్రభుత్వమును కోరారు కాని రూపాయికి బేడకంటే తక్కువపంట పండినప్పుడే రెమిషన్ ఇవ్వటానికి అవకాశము వుందని అంటున్నారు పంటపొడైనా, పెట్టుబడి ఎంతపెట్టినాసరే 0-2-0 కంటే తక్కువ పండినప్పుడే రెమిషన్ ఇవ్వటానికి వీలౌతుంది అని చెప్పారు అధికవర్షాలవల్ల సీజనల్‌గా వచ్చే అసౌకర్యాలవల్ల, ఎంతనష్టము వచ్చినా 0-2-0 కంటే తక్కువపంట పండినప్పుడే తప్ప రెమిషన్ ఇవ్వటానికి అవకాశంలేదని ప్రభుత్వం చెబుతున్నది అది న్యాయముకాదు లక్ష్మీకాంతమ్మగారు ప్రసంగిస్తూ ఒక విషయం చెప్పారు. అభివృద్ధి ప్రణాళిక అమలు జరగాలంటే గ్రామాభ్యున్నతి జరగాలంటే అదనపు పన్ను వేయాలని ఆమె చెప్పారు దీనిని వ్యతిరేకించేవారి చేతుల్లో అధికారం పెట్టిన వారు అధికపన్నులు వేయకుండా అభివృద్ధి కార్యక్రమాలను ఎలా అమలు జరుపుతారని ఆమె ప్రశ్నించారు

అది యదార్థమైన విషయమని నేను ఒప్పుకొంటున్నాను ఏ వృత్తులవల్ల వచ్చే ఆదాయముపైనైనను పన్నులు రాబట్టవలసినదే కాని అందరివద్దా ఒకే రకమైన పన్ను వసూలు చేస్తున్నప్పుడు, కొత్త ప్రాజెక్టుల క్రింద వున్నవారికి కల్పిస్తున్న వసతులను పాత ప్రాజెక్టులక్రింద ఉన్నవారికి కూడా కల్పించాలి మా నియోజకవర్గంలో మా తాలుకాలో అనేక సంగతులు వున్నాయి తెనాలి తాలూకాలో కొల్లిపర, చెవులూరు, దావులూరు అనే గ్రామాలకు నీటివసతివుంది "మురుగుకు ముందు, సాగుకు వెనుక" అనే సామెతరీతిగా ప్రతిసంవత్సరము మురుగు నీరువల్ల ఆ ప్రాంతమువారు చాల బాధపడుతున్నారు కాబట్టి మాకు మురుగు పారుదల సౌకర్యాలు కలుగ చేయండని అచ్చటి రైతాంగం అనేక విజ్ఞాపనలు చేసింది 4 సంవత్సరముల నుండి P W D వారు examine చేసి, మీరు full contribution ఇస్తేనే మురుగుపారుదల సౌకర్యాలను కలుగచేస్తామని రైతులకు చెబుతున్నారు ఇది న్యాయంకాదని మనవి చేస్తున్నాను 80 సంవత్సరాల క్రితం నీటివసతిని కల్పించి ఈనాడు మురుగుపారుదల సౌకర్యాలను కల్పించమని రైతాంగం అడిగినప్పుడు దానికి కావలసిన మొత్తము డబ్బు అంతా వారినే భరించమని చెప్పటం P W D అధికారులకుగాని, ఆశాఖకు కాని న్యాయము, ధర్మము కాదని నేను మనవి చేస్తున్నాను ఈ బిల్లు కర్తలైన శ్రీ కళావెంకటరావు గారు ఒక విషయం చెప్పారు ఆయన చిన్నతనములో 8 బస్తాలు పండే భూమిలో ఈనాడు స్వయముగా 16 బస్తాలు పండిస్తున్నామని చెప్పారు నేను వెంకటరావు గారిని ఎరిగివున్నప్పటినుండి, వారితో పరిచయం, స్నేహం వున్నప్పటినుంచి, కాంగ్రెసు ప్రభుత్వం వచ్చిన లగాయితూ ప్రతి ప్రభుత్వము లోనూ వారు మంత్రిగా వుంపటమే నాకు తెలుసునుకాని స్వంతముగా వ్యవసాయమును ఎప్పుడు అభివృద్ధిచేశారో నాకు తెలియదు

శ్రీ కె. వెంకటరావు నేను చెప్పిన విషయాన్ని గౌరవ సభ్యులు సరిగా వినిపించుకోలేదు. నా మేనల్లుడిద్వారా చేయించాననే నేను చెప్పాను.

శ్రీ పి. శ్రీరాములు : మేనల్లుడిద్వారా చేయిస్తే సంతోషమే పాత ప్రాజెక్టుల క్రిందనున్న కాలువలకు మరమ్మతు జరగటంలేదు. బ్రీచ్ పడుతుంటే బాగుచేయాలని P W D వారికి ఎన్నిసార్లు విజ్ఞప్తి చేసినా అవి యథా రూపములోనే వున్నవి. అనేక ఉదాహరణ లున్నవి. కాని అవన్నీ ఈనాడు ప్రభుత్వ దృష్టికి తీసుకురాదలచుకోలేదు. పన్నులు అధికంగా వేయాలనే నేను చెబుతున్నాను. కాని ఎక్కడ అయితే ఎక్కువ పన్నులు వున్నాయో, వాటి

తోపాటు సమానమైన పన్ను చెల్లించమని తక్కువ చెల్లించేవారిని అడుగుతున్నప్పుడు ఎక్కువ వసతులు వున్నవారితోపాటుగా ఆ వసతులనే తక్కువ చెల్లించే ప్రాంతపువారికి కూడా కలుగ చేయాలని నేను ప్రభుత్వమునకు మనవి చేస్తూ ఇంతటితో సెలవు తీసికొంటున్నాను

*శ్రీ ఆర్ బి రామకృష్ణరాజు (వడమలపేట) అధ్యక్షా, ప్రస్తుతం మన ఎదుట గొప్ప సమస్య ఏర్పడింది ప్రభుత్వానికి డబ్బు కావాలి

శ్రీ యల్ లక్ష్మణదాస్ (పాతపట్నం—జనరల్) అధ్యక్షా, తాంబూలం వేసుకొని మాట్లాడవచ్చా ?

శ్రీ ఆర్ బి రామకృష్ణరాజు తాంబూలం యిప్పుడు నోటిలో లేదండి మింగేశినాను (నవ్వులు)

మిస్టర్ స్పీకర్ తాంబూలం వేసుకొని మాట్లాడకూడదు అది మాత్రం నిజమే తెలిసికొంటే మంచిది

డాక్టరు బి గోపాలరెడ్డి వట్టి పొగాకు అయితే!

మిస్టర్ స్పీకర్ అయినాసరే, ఏదైనా సరే నములుతూ మాట్లాడకూడదు, అంతవరకే మంత్రిగారికి చెప్పేది

శ్రీ ఆర్ బి రామకృష్ణరాజు ప్రభుత్వానికేమిటి, దేశానికే డబ్బు కావాలి ఆ డబ్బు ఎట్లా సంపాదించాలనేదే సమస్య ప్రభుత్వంవారు బిల్లు తెచ్చిపెట్టారు ఇప్పుడు ఒక బిల్లు చర్చలో ఉన్నది మిగతా రెండు బిల్లులు కూడా రాదగ్గవే ఈ 3 బిల్లులు కూడా రైతుమీద భారం వేసేవే ఈ బిల్లుల ద్వారా కొంత డబ్బు సంపాదించడానికి ప్రభుత్వంవారు ప్రయత్నిస్తున్నారు ప్రభుత్వానికి డబ్బు కావలసినమాట వాస్తవమే కాని, ఈ విధంగానే డబ్బు సంపాదించడమా, లేక యితరవిధాలైన మార్గాలున్నాయా, అట్టి మార్గాలేవి? అని అన్వేషించకుండా ప్రజలమీద— ముఖ్యంగా రైతులమీదనే భారంపడే ఈ బిల్లులను సమర్థించాలా, కూడదా అనే సమస్య మాకోటివారిని కలవరపెడుతోంది మమ్ములనే అనవలసిన పనికూడా లేదనుకుంటాను ఇక్కడ జరుగుతున్న చర్చలను చూస్తే ప్రభుత్వంవారిని బలపరచే పార్టీలో కూడా కొందరు ధైర్యంగా మాట్లాడినారు, కొందరు మాట్లాడక ఊరుకుంటున్నారు పత్రికలో చూచినా బయట కలుసుకున్నా వారి అభిప్రాయాలు కూడా ఈ విధంగా డబ్బు సంపాదించటానికి సమ్మతంకాదు అని— ఒక్క రెవిన్యూ

మంత్రిగారు తప్పు.. . అని తేలుతోంది అయితే విధి లేక చేయవలసి వస్తున్నదని చెబుతున్నారు రెవిన్యూమంత్రిగారు మంచి డెల్టా పరియానుంచి వచ్చారు డెల్టా పరిస్థితి వారికి బాగుగా తెలుసు నీటివనర్లు విషయం వారికి తెలుసు ఈ భారం డెల్టాలోని రైతులు భరించగలరేమో - ఇంకా హెచ్చించినా భరించగలరేమో నాకు తెలియదు కాని, నేను చాలా శతాబ్దాలుగా వెనుక బడిన జమీందారీ ప్రాంతం నుంచి వచ్చాను కాబట్టి అక్కడి పద్ధతి ఎట్లా వున్నదీ, అక్కడ ప్రజల అభిప్రాయాలు ఏ విధంగా ఉన్నదీ నాకు తెలుసును జిల్లా సగటుగా డెల్టాకూ, మాకూ - అందరికీ ఒకే విధమైన భారం వేయడం న్యాయమా అనే విషయం ప్రభుత్వ దృష్టికి తేదలచుకొన్నాను జమీందారు లున్నప్పుడు మా ప్రాంతంలో పైరువారీ తీరువ వుండేది మిరప యింత, చెరకు యింత అని ఈ విధంగా ఉండేది ఈ ప్రకారం వేసినప్పుడు రైతులు చాలా బాధపడుతున్నారు, ఈ పద్ధతి బాగా లేదు రైత్వారీ యిలాఖాలో నున్నట్లు ఏ పైరుకైనా ఒకే పద్ధతి ఉంటే బాగుంటుందని ఏర్పాటు చేశారు ప్రచారం చేశాము, జమీందారులను రద్దు చేయాలన్నాము, రద్దు అయినాయి పైరువారీ తీరువా ఉన్నప్పుడు కరణంగారు చెప్పేదే వేద వాక్యం ఉన్నది లేనట్లు లేనిది ఉన్నట్లు వ్రాసి రైతులను బాధపెడుతున్నారని అలా చేశాము ఇప్పుడు ౩ బిల్లులలోనూ అది వస్తుంది కొందరు సోదర సభ్యులు చెప్పినట్లు లేనిపోని కల్పనలు కల్పించడానికీ, రైతులను బాధపెట్టడానికీ ఆస్కారం ఏర్పడుతోంది ఇదికాకుండా ఇప్పుడు మా యిలాఖాలో ప్రస్తుతం ఉన్న బిల్లు వల్ల రు 13½ మించక వేస్తామన్నారు, రూ 13-8-0 లు తీరువా అయితే, నూటికి రూపాయకు 5 అణాల వంతున సెస్సులు దానిమీద ¼ వంతు సర్చార్జి, education cess, library cess—— యివన్నీ అయితే సుమారు 22 రూ॥లు అయిపోతుంది ఈ విధంగా పన్నులు వేసినట్లయితే అందుకు మా ప్రజలు సిద్ధంగా లేరనిమాత్రం ప్రభుత్వ దృష్టికి తెస్తున్నాను. కేవలం ప్రభుత్వాన్ని విమర్శించి, ప్రభుత్వం వారిని కష్టపెడదామనీ అగౌరవరచుదామనే ఉద్దేశం మాకు లేదు ఈ విషయం స్పష్టంగా మరల చెప్పగలను. కాంగ్రెసు పార్టీయొక్క శ్రేయోభిలాషులము మేము. కాంగ్రెసు ప్రభుత్వం బాగుండాలనే, కాంగ్రెసు బాగుండాలనే దృష్టిగలవారమే కాని, ఏదో సమయం వచ్చిందికదా యని విమర్శించడం, లేనిపోని విషయాలు చెప్పడం మా ఉద్దేశంకాదు, ప్రయత్నం కాదు ప్రజలలో వుండే ఆందోళన గురించే ముఖ్యంగా మేము చెబుతున్నాము. ఈ బిల్లు ఎట్లాగూ pass అవు తోంది, అందుకు సందేహంలేదు. ప్రజలయొక్క అభిప్రాయాలను ప్రభుత్వం

వారికి స్పష్టంగా చెప్పవలసిన భారం మాయందు ఉన్నది, కాబట్టి చెబుతున్నాము నా వ్యక్తిగతాభిప్రాయ మేమంటే—1955వ సం లో కర్నూలులో ఈ బిల్లు వచ్చినప్పుడు కూడా భూమిమీద పన్ను వేయడం అన్యాయమనే నా అభిప్రాయం. భూమిపై పన్ను అనేది ఉండకూడదు బ్రహ్మాండమైన ప్రాజెక్టులు కట్టండి నీరు యివ్వండి, నీటితీరువా తీసుకోండి, అది న్యాయం కాని భూమి అనేదానికి పన్ను వేయడం సరైనపద్ధతి కాదు 'జమీందారులు భూమికి ఈ విధంగా పన్నులు వేస్తున్నారు ఆ భూములు జమీందారుల తాతసొమ్మా అబ్బ సొమ్మా' అన్నాము, వారిని తీసేయాలనుకున్నాము, తగ్గించేశాము ఈనాడు జమీందారులు లేరు యిప్పుడు ప్రభుత్వంవారి సొమ్మా, వారితాతసొమ్మా, అబ్బ సొమ్మా? భూమి అందరకూ సామాన్యంగా ఉండేది ప్రభుత్వంవారు చేసే కార్యాలకు, దేశంలో వుండే ప్రతి మానవుడూ ప్రభుత్వం చేసేపనికీ, రక్షణకూ తార్కాణంగా ఏదైనా యివ్వడం న్యాయం అదికాదని ఎవ్వరూ చెప్పలేదు దేశంలో ఉన్నటువంటి వారిని ఏదో వారి వారి గృహకృత్యాలు నెరవేర్చుకొని వారి ఉదర పోషణ జరుపుకొని ఏదైనా కొంచెం మిగిలితే కొంచెం మాకు యివ్వండి అని అడగడం న్యాయమే కాని, ఉదర పోషణ జరిగిందా, లేదా అతడు చేసే కార్యక్రమం లాభకరమా, నష్టకరమా అనేది యోచించకుండా నీకు భూమి ఉన్నది కాబట్టి యింత పన్నుయివ్వాలని అడగడం కేవలం అన్యాయమని నా అభిప్రాయం

Taxation Enquiry Committee వారు చేసిన సిఫార్సులు నాకు తెలుసు వాటిని గురించి మంత్రిగారు కూడా యిప్పుడే శలవిచ్చారు కాని నేను దానికి వ్యతిరేకమైన అభిప్రాయం గలవాడిని మనం చేసేపనులు విషయం పరిశీలించండి ఆ పనులవల్ల వచ్చేలాభం చూడకుండా పన్నులు వేయకూడదు ఏ పని చేసినా దానివల్ల వచ్చే ఆదాయంమీద పన్ను వేయాలి కాని ఆదాయం వచ్చినాసరే, రాకపోయినాసరే పన్ను యివ్వవలసిన విధానం మనకు ఉండరాదు. మనకు income tax ఉన్నది, 3 వేల 6 వందల రు ల ఆదాయం వచ్చే వారందరకూ income tax లేదు అన్ని సౌకర్యాలూ మాకే పట్టణాలు మాకే, రోడ్లు మాకే, విద్యుచ్ఛక్తి, ఆస్పత్రులు, స్కూల్సు అన్నీ మాకే, ఏ తీరువా లేదు, కుగ్రామంలో కేవలం జంతువులవలె జీవించే వారికి భూమి ఉన్నది కాబట్టి పన్ను యివ్వవలసిందే అని విధించడం న్యాయంకాదు

"నీకు ఆ భూమిలో ఏమి వస్తున్నదో అనేదానితో మాకు సంబంధంలేదు. వచ్చినా సరే, రాకపోయినా సరే మాకు యివ్వవలసిందే" అనడం పరమ అధర్మమని నా అభిప్రాయం ప్రభుత్వంవారు taxes వేసే విధానంలో భూమి

శ్రీ రామకృష్ణారెడ్డి

పన్ను అయినా, sales tax, income tax - ఏదైనా ఒకటే - తేడా ఏమీలేదు భూమి జమీందారు సొత్తు కాబట్టి తీరువ యివ్వాలి అనేవిషయం పోయింది కాని ప్రభుత్వం నడవడానికి taxes కావాలి ప్రజలయొక్క క్షేమానికి గాను వేయవలసినది taxes కాని అటువంటి taxes ను ఈవిధంగా వేయడం పరమ అధర్మమని నా అభిప్రాయం ఈ విషయాన్నే శ్రీ టి టి కృష్ణమాచారిగారు పేపరులో వ్రాశారు బహుశా అంతా చూచేఉంటారు ఇప్పుడు కాకపోయినా, కొలది సంవత్సరాలలోనే ఈ అభిప్రాయం బలపడి taxes పోతాయని నేను జోస్యంకూడా చెప్పగలను భూమి మీద పన్ను వేయకూడదని నా వ్యక్తిగతాభిప్రాయం అందువల్ల దానిని జాస్తిచేయాలని చెప్పడానికి నా మనస్సు ఒప్పుకోవడంలేదు కాబట్టి ఈ విధానాన్ని అవశ్యం మార్చవలసినదని నేను మనవి చేయక తప్పదు

ఈవిధంగా కూడదంటున్నాము దీనికి ప్రత్యామ్నాయంగా ప్రభుత్వానికి కావలసిన డబ్బు ఏవిధంగా సంపాదించాలనే విషయమై మేము అనేక సూచనలు యిస్తాము. అయితే, మేము చెప్పడమే కాని, ప్రభుత్వం వాటిని తీసుకోదు తీసుకున్నా, తీసుకోనకపోయినా ఖచ్చితంగా చెప్పాలనే నా అభిప్రాయం చెబుతున్నాను

Prohibition కావాలనే వారితో సమానంగా నేను కూడా ప్రచారం చేశాను. త్రాగుడును రూపుమాపాలని ప్రయత్నంచేసినవారిలో నేను ప్రథముడనని కూడా చెప్పవచ్చు చాలా ప్రయత్నంచేశాం ఇప్పటికి అది fail అయిపోయింది కాబట్టి అది వద్దు అని కాదు నా అభిప్రాయం Fail అయినా, కాకపోయినా ఆ విధానం ఉండడం మంచిదే ఆ డబ్బు మనకు వద్దు అంటే నేనూ ఒప్పుకుంటాను. ఇది పాపపు సొమ్ము, బీదల నోటిలో విషంపోసి సంపాదించిన డబ్బు ఆ డబ్బు తీసుకుంటే గాంబ్లింగు పెట్టవచ్చు, బ్రోతల్సు పెట్టవచ్చు, డబ్బే ప్రధానమైతే. కావున త్రాగుడు నీతి బాహ్యమే గవర్నమెంటు ప్రోత్సహించవలసినది కాదు.

అయితే ఇపుడు మనం ఏమిచేయగలం ? ఈ prohibition మనదేశం అంతటా ఉందా ? ఏమి. మనకుమాత్రం వచ్చినభారం ఏమి ? అంతా పెట్టుకోనపుడు మనమీద ఈ భారం పెట్టుకొని బాధలుపడవలసిన కారణం ఏమి ? ఇటీవల జూలై నెలలో ఈ విషయంలో నేను మాట్లాడినపుడు మన ముఖ్యమంత్రిగారు దీనినిగురించి 2 కారణములు చెప్పినారు. ఈ prohibition ను తీసివేయకూడదనేటటువంటి విషయం గురించి రెండు కారణాలు చెప్పారు. 1955 వ

సంవత్సరంలో జరిగిన elections ఈ సమస్యమీదనే కాబట్టి, ఆ question మీద వచ్చినవాళ్ళం అది కూడదని చెప్పడం సాధ్యంకాదు అని చెప్పారు ఈ విషయం బహుశః మన ముఖ్యమంత్రిగారు మరచిపోయారనుకుంటాను 1955 వ సంవత్సరంలో ఈ సమస్యమీద election జరగలేదు. Government వారు ఈ సమస్యమీద ఓడిపోయినమాట నిజమే బయటికి వచ్చినప్పుడు ఏమైంది ? మన లచ్చన్నగారు వేరేపార్టీని పెట్టారా ? వారు ప్రచారం చేశారా ? Prohibition తీసేయవద్దని మనం ప్రచారం చేశామా ? Prohibition తీసేయ కూడదని మనవాళ్ళు ప్రచారం చేశారా ? ఎక్కడైనాసరే ఈ ప్రచారం చేయడం జరిగిందా ? ఎవరైతే కాంగ్రెస్ ప్రభుత్వాన్ని 1954 సంవత్సరంలో ఓడించారో వారు, కాంగ్రెస్ వారు, అందరూ కలసి ఒకటేఅయి ఒకరితోనొకరు చేతులు కలుపుకున్నారు మనం చేయవలసిందేమి ? 'Communist Party ని రాకుండా చూడవలసియున్నది,' అనే ప్రధానమైనటువంటి సూత్రంతోనే వర్తించినాము అపుడు చేసిన ప్రయత్నం అంతా అదేప్రకారం జరిగింది కాబట్టి 1955 వ సంవత్సరంలో ఈ prohibition సమస్యమీద election జరిగిందని చెప్పడం నిజంకాదు దీనినిగురించి ఇంకా ఒకవిషయం చెప్పాలను కొన్నాను కాని time లేదు కాబట్టి చాలించుకుంటున్నాను ఇంకొక కారణం ఏమిచెప్పినానంటే, prohibition వల్ల వచ్చేడబ్బు బీదలవద్దనుంచి వచ్చేది ఆ డబ్బును బీదలవద్దనుంచి తీసుకొని మనం ఆ డబ్బునంతనూ పెద్దవాళ్ళకు, ధనికులకు, ఉపయోగించడం అన్యాయమని చెప్పినాను ఇవుడు మనం ఏమిచేస్తున్నాం ?

మిస్టర్ స్పీకర్ తమరు prohibition మళ్లా తీసేయమంటారా ?

శ్రీ ఆర్. బి రామకృష్ణరాజు ఔను ఇపుడు మనం వేసే plan మహా రాజులకేనా ? మనం వేసే plan అంతాకూడా గ్రామాలనుంచే బయలుదేరుతూ ఉంది మనం వేసిన కార్యక్రమం అంతా గ్రామాలకే. గ్రామాలలో ఉన్న వారంతా ఎవరు ? మహారాజులా ? బీదవారా ? కాబట్టి మన plan చక్కగా కనుక జరిగితే ఈ plan వల్ల లాభంపొందేవారు ఈ బీదవారే కాబట్టి మనం బీదవాళ్ళకోసం పని చేస్తున్నప్పుడు బీదవాళ్ళ దగ్గరనుంచి డబ్బు తీసుకోవడం తప్పుకాదు ఆ డబ్బు బీదవాళ్ళవద్దనుంచి తీసుకొని, కలిగినవారే ఉపయోగించు కొనేందుకు కారణం లేదు కాబట్టి బీదవారి దగ్గర్నుంచి డబ్బు తీసుకోవడంలో కూడా ఏ విధమైన ఆక్షేపణా లేదు ఇంకొక కారణం కూడా చెబుతున్నారు

ఇపుడు తెలంగాణాలో ప్రొహిబిషన్ లేదు, దానికేమిచెప్తారని వారిని ప్రశ్నించాము దానికి ఒకటే సమాధానం చెప్తానన్నారు ముఖ్యమంత్రిగారు

"తెలంగాణావాళ్లు కావాలంటే పెడతాము, వద్దంటే తీసేస్తామన్నారు" తెలంగాణావాళ్లు చెపితే శంఖంలో తీర్థమా ? మేం చెపితే తప్పా ? దేశానికి అరిష్టమైనటువంటి విషయం అయితే తెలంగాణావాళ్లు వద్దన్నా కూడా మన విధి ఏమి ? వాళ్ళను ఒప్పించవలసియున్నది అదేవిధంగా మన రెవిన్యూ మంత్రిగారు నేను లేనప్పుడు మాట్లాడుతూ తెలంగాణాలో కూడా (It is a question of time) పోతుందని అన్నారు అంటే అర్థం ఏమి ? Question of time ఏమి ‹ ఎందుకు నిదానించాలి ?

మిస్టర్ స్పీకర్ మనకున్నది తీసివేయడం, వాళ్ళకు లేనిది పెట్టడం అదే భేదం

శ్రీ ఆర్ బి రామకృష్ణరాజు ఇపుడు డబ్బు విడుచుకోడానికి వీలులేదు మనకు డబ్బుకావాలి ఇప్పుడింకా ఇతరచోట్ల పెట్టకపోతే,—మైసూరు రాష్ట్రంలో పెట్టకపోతే, అసలు ఢిల్లీలో, మన పెద్దలుండే చోటనే పెట్టకపోవటానికి కారణంఏమి ? డబ్బు విడుచుకోడానికి సాధ్యంకాదు ఈ డబ్బుతో మనకు చాలా అవసరంఉంది కొన్నిచోట్ల దీనిని తీసేయకుండా జరుపుకుంటున్నారు మనం ఇపుడు దీనిని తీసేసి మళ్లా పెట్టడమా, లేదా ? అనేదే question. ఇపుడు ఎక్కడచూసినాకూడా - ప్రజలు దీనిని తీసేయమంటున్నారు మన Home Minister గారు చెప్పినారు వారు గుంటూరుకుపోతే అక్కడ వాళ్లు వారితో "దీనిని తీసేయండి, తీసేయండి" అని చెప్పినారట ఇపుడు నేను ఈ విషయం మీద పందెం వేస్తున్నాను మంత్రులను ఏ గ్రామానికైనా రమ్మనండి ఏ గ్రామానికైనా వెళ్ళి అయ్యా ! మనకు ఇపుడు 24 కోట్ల రూపాయలు కావాలి 24 కోట్ల రూపాయలను, మీరు మాకు taxes మూలకంగా యిస్తారా? అని, లేక ఈ Prohibition తీసివేయమంటారా అనే సమస్య పెట్టండి, అపుడు అడగండి దానికి జవాబేమి చెప్తారో చూడండి

శ్రీ కె. వెంకటరావు : సభ్యులు అడగమన్నది ఎవర్ని ? Prohibition వల్ల లాభం పొందిన వాళ్లనా లేకపోతే పన్నులు యిచ్చే వాళ్లనా ?

శ్రీ ఆర్. బి. రామకృష్ణరాజు : అందరినీ అడగండి ఎవర్నడిగినాసరే, పెద్ద meetings పెట్టి వాటితో జనసామాన్యాన్ని అడగండి. నేను ఇపుడు

ఇక్కడ మాట్లాడే దానికిముందు, కొన్ని meetings పెట్టి అడిగాను మా తాలూకాలో నేను విచారించి వచ్చినాను ముఖ్యంగా వాళ్లకు "అందరూ తాగుతున్నారు, చెడిపోయారా" అనేటువంటి అభిప్రాయం సామాన్యంగా, ప్రజలందరికీఉంది

మిస్టర్ స్పీకర్ గుడిసెలలో ఉండే ఆడవాళ్లకు కూడా అదే అభిప్రాయమా ?

శ్రీ ఆర్. బి రామకృష్ణరాజు అందరికి అదే అభిప్రాయము ఆడవాళ్లతో మాట్లాడేవిధం నాకు తెలియదండి మన Finance Minister గారికి తెలిసుంటే వారితోపోయి ఆడవాళ్ళతో మాట్లాడి తెలుసుకోవచ్చు

మిస్టర్ స్పీకర్ . వాళ్ల అభిప్రాయం కూడా కనుక్కోవద్దా ? కనుక్కోవాలి వాళ్ళంతా మనకు తల్లులు, వాళ్ళతో మనం మాట్లాడుతాము.

శ్రీ కె వెంకటరావు మొన్న చెప్పారు 'సరసులు, రసజ్ఞులు' అని అంత compliment పుచ్చుకున్నాక, లేదంటే ఎలా కుదురుతుంది

*Sri V K Naik (Sultanbazar)*. Sir, on a point of information, Bombay Government in Marathwada area has recently introduced a belt of 10 miles in prohibition and by 1959, they have proposed to have a complete prohibition in Marathwada area

*Sri R B Ramakrishna Raju* I do not dispute all that. I know all that We are having it in the whole area.

మనం కేవలం ప్రతిష్ఠమీదనే ఉందామా ? ఈభారంఅంతా సామాన్యజనుల మీద పడేయకుండా మరోమార్గమేదైనా కనిపెడదామా ? Orissa State లో కూడా దీనిని ప్రవేశపెట్టడానికేదో ప్రయత్నం చేస్తున్నారని పేపర్లో వచ్చింది. బహుశః దానికి అంతరాయం కల్గిందని కూడా వింటున్నాము దీనినిగురించి ఇదివరకు కర్నూలులో ఉన్నపుడు మా ప్రతిపక్ష నాయకులు అపుడు ఉన్నటువంటి ముఖ్యమంత్రిగారిని, "India Government వారిని ఒత్తిడి చేయకూడదా? వారిమీద ఒత్తిడి తీసుకువచ్చి ఇది చేయకూడదా ? అది చేయకూడదా" అని అడిగినపుడు - అపుడు Chief Minister గా ఉన్నటువంటి గోపాలరెడ్డిగారు "ఒత్తిడిచేయడమంటే అర్థంనాకు తెలియదండి, ఒత్తడమేమో నాకు తెలుసు కాని, ఒత్తిడి చేయడం నాకు తెలీదన్నారు. ఒత్తిడి చేయడమంటే ఎట్లాగో ఇపుడు

నేను చెప్తాను ఇపుడు ఒరిస్సా గవర్నమెంటుకు కూడా ఇది, వద్దనే ఉంది నా అభిప్రాయంతో వారు ఏకీభవించినట్లయితే, వారికికూడా ఇది, వద్దనే అభిప్రాయం ఉంది మన State లో ఈ ప్రకారంగా అభిప్రాయం ఉందికనుక అన్నిచోట్లా ప్రచారం చేద్దాం ఈ ప్రకారంగా ఉంది కాబట్టి "అయ్యా, ఇపుడు కాదు 10 సంవత్సరములు పోనీయండి, ఇపుడు మాకు డబ్బు కావాలి డబ్బుతో మాకు అవసరం ఉంది ఆ డబ్బును వేరేవిధంగా, తీసుకోడానికి సాధ్యం కాదు దీనికి taxes వేసుకోడానికి ప్రజలలో యిష్టంలేదు, కాబట్టి మాకు అనుజ్ఞ యివ్వండి ఒక 1( ఏళ్ళపాటు పోనివ్వండి మీరు మేము అంతాకలసి దేశం మొత్తానికి పెట్టుకుంటే పెట్టుకుందాము ఢిల్లీలో మీరంతా కూర్చుని తాగుతూండడమేమి? మమ్ములను మాత్రం వద్దనడమేమి" అని అడగలేమా? ఇదీ, ఒత్తిడి అంటే నా ఉద్దేశం ప్రభుత్వంవారికి నేను ఇచ్చే సలహా ఏమిటంటే కేవలం ప్రతిష్ఠకే పాటుపడకుండా మనదేశంలో ఉండేటటువంటి అభిప్రాయము మనస్సుకు పట్టేటట్లయితే ధైర్యంగా నిలబడి ఏప్రకారమైతే నేను కాంగ్రెస్ అని చెప్పకోనికూడా ధైర్యంగా నిలబడుతున్నానో ఆ ప్రకారమే మీరుకూడా ధైర్యంగా చెప్పి ఈ బాధను మనకు తప్పించాలి ఒక 10 ఏళ్ళపాటు పోదాం మనకు వచ్చేడబ్బు తీసుకొని మనకు కావలసిన కార్యాలన్నీ చేసుకుందాం అయ్యా ఈ ప్రకారం దేశం క్షేమంగా ఉంది, అన్ని విధాలా సౌఖ్యంగాఉంది. అనేక సౌకర్యములు కలుగచేసినాము, చెరువులు త్రవ్వించాము, బాటలు వేయించాము, అన్ని కాలువలు త్రవ్వించాం, రోడ్లు వేయించాం, అన్ని సౌకర్యములు చేసినాము, కాబట్టి ఒక రూపాయి జాస్తీ యిమ్మంటె సంతోషంగా యిస్తాం శ్రీ కళా వెంకట్రావుగారు ముందు ప్లానింగ్ మంత్రిగా ఉన్నపుడు జిల్లా ఒకటికి ఒకకోటి రూపాయలు ప్రత్యేకించమని నేను సలహా యిచ్చాను వారు ఆ ప్రకారం చేశారు దానిని ఇండియా గవర్నమెంటువారు కొట్టిపారేశారు అది కనుక జరిగిఉంటే ఒక జిల్లాకు కోటి రూపాయలు కేటాయించి ఆ కోటి రూపాయలను మాచేతికిచ్చి, కలెక్టరు స్వాధీనంచేసి జిల్లాలో మీరే కార్యాలు చేసుకుంటారో చేసుకోండయ్యా అంటే ఈపొద్దు మనకు ఈ బాధ ఉండేదికాదు మేమంతా ధైర్యంగా చెప్పవచ్చు ఇన్ని రూపాయలు మనకు యిచ్చారు ఒక్కొక్క తాలూకాకు 10 లక్షల రూపాయలు వచ్చింది చెరువు త్రవ్వుకున్నాము. బాటలు వేసుకున్నాం, రోడ్లు వేసుకున్నాం కాబట్టి గవర్నమెంట్ వారు డబ్బు యివ్వలేదంటే న్యాయంకాదు అని చెప్పవచ్చు మెట్టప్రదేశాల్లో ఈ ప్రకారం ఇంత భారమైనటువంటి పన్నులు చెల్లించడం చాలా కష్టతరమైనటువంటి విషయం ఈ పన్నులను చెల్లించడం

అందరికీ సాధ్యంకాని విషయం మా సలహాలు తీసుకొని ఈ భారం తగ్గించే ప్రయత్నం చేసినట్లయితే వారు, మేము, దేశమంతా సంతోషించడం జరుగుతుంది క్షేమంగా ఉండవచ్చును కొన్ని సంవత్సరాలైన తరువాత నీతి నియమాలను మనం అందరికీ బోధించడానికి ప్రయత్నం చేయవచ్చును

శ్రీ కె ఎల్ నరసింహారావు (ఎల్లందు-జనరల్) అధ్యక్షమహాశయా! ఈ session లో కొన్ని tax Bills మనకు distribute చేయబడ్డాయి వాటిలో ఇపుడు Additional Wet Assessment Bill మనముందు చర్చనీయాంశముగా నున్నది ఇపుడు ఇంకా ఇతర బిల్లులు ఏవైతే ఉన్నవో అవన్నీ ఒకదానికొకటి పరస్పర సంబంధం కల్గియున్నాయి వీటన్నింటినీ సూక్ష్మంగానైనా touch చేయకుండా దీనిమీద మనం క్షుణ్ణంగా చర్చించడమనేది సాధ్యపడే విషయం కాదు ఇదివరకు అనేకపర్యాయాలు ఆంధ్ర, హైదరాబాద్ ప్రభుత్వాలు ఒకవిషయాన్ని ఒప్పుకుంటూ వచ్చినవి హైద్రాబాదుస్టేటు కానివ్వండి, ఆంధ్రస్టేట్ కానివ్వండి ప్రజల ఆర్థిక పునాదులపైన, ఆర్థిక పరిస్థితులదృష్ట్యా ఈ పన్నులు విధించాలనే విషయాన్ని ఒప్పుకొంటూవచ్చినవి రైతులు, వారి శక్తికి మించిన పన్నులు ఇదివరకే చెల్లిస్తున్నారు వాళ్లు ఇక పన్ను చెల్లించే పరిస్థితిలో లేరు అందుచేత వాళ్లమీద ఇంకా అదనంగా పన్నును విధించడమనేది సాధ్యపడే విషయంకాదు మనం మన నిర్మాణకార్యములను development కార్యములను సక్రమంగా నిర్వహించడానికి డబ్బు రాబట్టడానికి వేరే మార్గోపాయా లేమైనా ఉన్నాయా, అనేదానిని ఆలోచించడానికి ఇదివరకే అంగీకరించారు 2, 3 సందర్భాలలో శాసనసభలో కూడా దానిని స్పష్టపరచారు అయితే ఈవేళ రైతులమీద 2, 3 రకాల పన్నులు విధిస్తూ మన ముందరికి బిల్లులు వచ్చినవి ఈ రోజున ఈ Wet Assessment Bill లో water assessment rate పెంచబడుతున్నది దీనికి తెలంగాణాతో నిమిత్తంలేదు దీనిని పరిశీలించి చూస్తే ఒక gradation పద్ధతిపైన కాని, లేక రైతుయొక్క ఆదాయాన్ని కాని పునాదిగాచేసుకొని విధిస్తున్న పన్ను కాదిది. సాధారణంగా తరి భూమి పట్టా గల్గియున్న ప్రతివ్యక్తి మీద- అంటే ఆంధ్రప్రాంతంలోనే అనుకోండి- ఈ పన్ను వేస్తున్నారు మనం దీనిని గురించి ఆలోచించవలసివచ్చినపుడు ఈ వేళ రైతుయొక్క ఆర్థికస్థాయి ఏవిధంగా ఉందో, అదనంగా పన్నులు చెల్లించగల్గిన పరిస్థితిలో ఉన్నాడా లేడా అనేవిషయాన్ని చర్చించవలసిన అవసరం వుంది అంతేకాకుండా ఈ బిల్లు నుంచి తెలంగాణా ప్రాంతాన్ని ఎందుకు మినహాయిస్తామన్నారు ? అనేది కూడా కొంతవరకు చర్చించవలసిన అవసరం కూడ ఉందని అంటున్నాను

తెలంగాణా ప్రాంతంలో ఇదివరకు మాగాణిభూములమీద పన్నులు ఎక్కువగా ఉన్నాయి కాబట్టి దీనిని తెలంగాణాప్రాంతానికి వర్తింపచేయడం లేదు అనే అన్‌డర్‌స్టాండింగ్ దీంట్లో ఉన్నది ఐతే యీ వేళ ఆంధ్రప్రాంతము లోని రైతులందరూ ముూకుమ్మడిగా యీ పన్నులను అన్నిటినీ భరించడానికి సిద్ధముగా నున్నారా, మోయగలిగిన శక్తి వారికి ఉన్నదా అనేది పరిశీలించ వలసిన అవసరమున్నది ఈనాడు రైతు భూమిమీద పెట్టే పెట్టుబడి, భూమి మీద చేసిన ఖర్చులకు సరిపోవడంలేదు కళా వెంకట్రావుగారు వారి చిన్న తనంలో 10 బస్తాలు పండేభూములు యీనాడు 15 బస్తాలు పండుతున్నాయని అన్నారు రైతు ఆదాయము పెరిగిపోయింది ఆమేరకు ప్రభుత్వమునకు పన్నులు రావడంలేదు ఇటు ప్రభుత్వఖర్చులు కూడా పెరిగాయి కాబట్టి ఏవిధంగానైనా పన్నులు రాబట్టాలనే ఉద్దేశంతో మేము విధిస్తున్నాము అనే రూపంగా మంత్రిగారు చెప్పారు దానికి ఒప్పుకోవచ్చు కళా వెంకట్రావుగారి బాల్యానికి ఇప్పటికి చాలా తేడాఉన్నది ఎకరానికి 10 బస్తాలనుంచి 15 బస్తాలవరకూ పంట పెరగడమే కనిపిస్తోందిగాని వ్యవసాయఖర్చులు ఏ విధముగా పెరిగాయో ఆలోచించడానికి వారు ప్రయత్నించటంలేదు అంతే కాకుండా రైతు జీవితావసర ఖర్చులు ఏవిధంగా పెరిగాయో చెప్పటకు మంత్రిగారు ఏమాత్రము ప్రయత్నము చేయడంలేదు భూమిమీద ఉత్పత్తి ఎక్కువగా పెరిగింది, వారికి ఎక్కువ ఆదాయము వస్తున్నది అందుచేత మేము పన్నులు విధిస్తున్నామనిమాత్రమే మంత్రిగారు చెబుతున్నారు అది సరైనపద్ధతి కాదు. కొంతవరకు భూమిమీద ఉత్పత్తి పెరగడం వాస్తవమే కాని భూమిని దున్నడానికి, సాగుచేయడానికి వారి బాల్యదశలోకంటే ఇప్పుడు రెండు, మూడు రెట్లు ఎక్కువగా ఖర్చు భరించవలసివస్తున్నది వారు యిచ్చిన లెక్కలు ప్రకారము ఉత్పత్తి 10 బస్తాలల్లా 15 బస్తాలు అయినాయి అంటే ఒకటికి ఒకటిన్నర అయినాయి దానికయ్యే ఖర్చులుకూడా ఒకటికి మూడు నాలుగు రెట్లు పెరిగాయని అందరూకూడా అంగీకరిస్తారనుకుంటాను అపుడు టాక్సేషన్ అవసరమా, లేదా ఏమిచేయాలి అనేది ఆలోచించుటకు సెలక్టుకమిటీకి పంపు చున్నారు వారు తుణ్ణంగా పరిశీలిస్తారనుకుంటాను ఇపుడు యీ పన్నులు 18-12-0 నుంచి 37-8-0 రూ॥లకు పెంచుతున్నారు, ఇది ఏ పరిస్థితిలో కూడా సింగిల్‌క్రాప్ భూమిమీద 13-50 నయాపైసలకంటె మీరకూడదని, డబుల్‌క్రాప్ వరియాలో 20 రూపాయల 25 నయాపైసలకంటే మించ కూడదనే విషయాన్ని వారు యీ బిల్లులో పొందుపొరచారు కాని దానిక్రింద ఇంకో ప్రొవిజో ఉంది. దానిలో యీ రోజున ఎక్కువ చెల్లించేవారికి తగ్గించు

టకు వీలులేదని వుంది దానిని ప్రభుత్వము స్పష్టముగా ఒప్పుకుంది. ఆ పన్నులు వేయడం తప్పని నేను భావిస్తున్నాను ప్రభుత్వము వారు కూడా ఆ మేరకు అంగీకరించుతున్నారు

ఈవేళ మాగాణీ పంటపండే భూమి సింగిల్ క్రాప్ ఏరియా ఐతే 13-50 న పై ల కంటే ఇచ్చుకోలేడు అనేదానికి ప్రభుత్వము ఒప్పుకుంటూం దనుకుంటాను ఒప్పుకోమంటే అది వేరే విషయము అట్లానే 20-25 న పై కంటె డబుల్ క్రాప్ ల్యాండ్సుగల రైతు ఇచ్చుకోలేడనేదానిని ప్రభుత్వము ఒప్పుకుంటుంది కాని యీ ప్రావిజోలో ఎవరయినా యింతకంటే అదనముగా చెల్లిస్తూఉంటే వారికి మాత్రము తగ్గింపు అనే సమస్య రాదు వారు ఇదివరకు చెల్లించే అదనపు మొత్తమును చెల్లించవలసినదే అని దీనిద్వారా మాపిస్తు న్నాను తక్కువ ఉన్నవారిమీద పెంచడానికి మాత్రము సిద్ధపడుతున్నారు కృష్ణా, గోదావరి జిల్లాలలోని రైతులు మాగాణీ భూములను చాలా కాలంగా అనుభవిస్తున్నారు అక్కడ ఉత్పత్తి పెరిగిందని కళా వెంకట్రావుగారు చెప్పారు ప్రభుత్వము కట్టబోయే కొత్త ప్రాజెక్టుల క్రింద నీరు తీసుకొనే సింగిల్ క్రాప్ భూములకు 15 రూ లనీ డబుల్ క్రాప్ అయితే 23 రూ అనీ ఇదివరకే నిర్ణయము తీసుకోవడము జరిగింది కొత్తగా సాగులోనికి తీసుకొనివచ్చిన భూమిని పంటకు లాయికీగా చేసే విషయంలో చాలా ఖర్చులకు లోను కావలసివస్తూంది కాని దీర్ఘకాలంగా అనుభవిస్తూ కొద్దోగొప్పో లాభాలు గడిస్తున్నవారు 13 రూ చిల్లరకంటే ఇచ్చుకోలేరు డబుల్ క్రాప్ ఏరియాలోనివారు 20 రూపాయల చిల్లరకంటే ఇచ్చుకోలేరు అనేదానిని ఒప్పుకుంటూ కొత్తగా మాగాణిగా చేయబడినవాటికి నిర్ణయింపబడినది హైయస్టు రేటు ఉంచాలనేది మాత్రము సరిఅయినదని కాదని అనుకుంటాను ఈ విషయంలో ప్రభుత్వము ఆలోచించవలసి యున్నది తక్కువ చెల్లించే వారికి ఎక్కువచేయడం న్యాయమని మనం ఎట్లా అనుకుంటున్నామో అట్లాగే ఎక్కువ భారాన్ని మోస్తున్న వారిమీద తక్కువచేయడం న్యాయం. ఈ వేళ కొత్తగా సాగులోనికి వచ్చిన భూమిని మాగాణీగా మార్చుకోవాలి ఇందుకు అనేక కష్టాలు పడవలసియున్నది యీనాడు కృష్ణా జిల్లాలో వచ్చినంత ఫలితం (యీల్డు) ఇతర జిల్లాలలో రావడంలేదు అయినా ఏ కారణంచేతనో ఎకరా ఒకటికి 15 రూ. శిస్తు అన్నాము దానినితగ్గించడానికి ఎందుకు ప్రయత్నము చేయకూడదు ? ఈ విషయమై ప్రభుత్వం ఆలోచించవలసిన అవసర మున్నదని అనుకొంటున్నాను. ఈ బిల్లు ద్వారా పన్ను పెంచేటప్పుడు వారికి వచ్చే ఆదాయాన్ని దృష్టిలో పెట్టుకుని పెంచడం చాలా న్యాయం అట్లా

కాకుండా ప్రతి రైతుమీద పన్నులభారం పడేటట్లు చేయడం ఏమాత్రం న్యాయంకాదు దానికి మనదేశంలో ఉన్న భూపరిమితిని బట్టి, సమస్యలనుబట్టి ఆలోచించవలసిన అవసరమున్నది భూమి ఎంతమంది క్రింద ఉన్నది వారి ఆదాయం ఏ మేరకు వస్తోంది అనే విషయం కూడా పరిశీలించవలసిఉంటుంది కొద్దో, గొప్పో భూమి ఉన్నవారంతా కూడ రైతులుగానే పరిగణింపబడు తున్నారు ఈ చట్టంవల్ల అంతా పట్టాదారులుగానే గుర్తింపబడతారు వీరందరికి ఎక్కువ పన్నులు వర్తిస్తాయి అట్లాంటప్పుడు ఒకటి, రెండు, మూడు, నాలుగు ఎకరాలభూమి ఉన్నవారు కుటుంబాలను పోషించుకోవడం కష్ట మవుతుంది రైతులు జీవించే అవకాశమేలేకుండా పోతోంది వచ్చే ఉత్పత్తిని వకటి రెండు మాసాలు ఉపయోగించుకుని అది ఐపోగా తక్కిన కాలమంతా వ్యవసాయ కూలీగానో, ఇతర వృత్తిచేసుకొని కష్టపడి తన పొట్టను పోసుకో వలసిన దురవస్థలో ఉంటున్నారు భూమిద్వారా అతనికి జీవన భృతికూడా సరిపోని ఆదాయంవస్తున్న సాధారణ రైతుమీద కూడ పన్నులు విధించే విధానం సరయినదికాదు ఆదాయం ఎక్కువ వస్తున్నవారిమీద గ్రడేషను సిస్టం ఉపయోగిస్తే బాగుంటుంది అంతేకాకుండా తెలంగాణాలో మాగాణీ శిస్తురేట్లు ఆకాశాన్నంటుకొన్నాయి వాటిని తగ్గించడానికి ప్రభుత్వం పూను కోవడంలేదు ఒక ప్రక్కన ఇక్కడ ఎక్కువ రేట్లున్నాయని ఒప్పుకొంటోంది కాని తగ్గించడానికి మాత్రం పూనుకోవడంలేదు రెండవ ప్రక్కన తక్కువ ఉన్నచోట హెచ్చుచేయడానికి పూనుకొంటోంది ఈ మధ్య రంగారెడ్డిగారు మాట్లాడుతూ పన్నులన్నింటినీ ఒకే లెవెలుకు తీసుకురావడానికి ఆంధ్రలోను, తెలంగాణాలోను విడివిడిగాఉన్న రెవిన్యూ సిస్టమును సమీకరించడానికి ఒక కమిటీని వేయబోతున్నారన్నారు ఆ కమిటీ ఏమి నిర్ణయిస్తుంది? ఎప్పుడు వస్తుంది అనేది మన ముందులేదు అయినప్పటికి వీటన్నింటిని పరిశీలించాలి ఇవ్వేళ రైతుయొక్క ఆర్థిక పరిస్థితి ఏమిటి అనేది చూచుకుని మోయగలిగిన వారిమీద పన్ను విధించడం బాగుంటుంది అట్లాకాకుండా మూకుమ్మడిగా పన్నులు విధించడం - ఎక్కువ ఉన్నచోట తగ్గించేందుకు సాహసించకుండా తక్కువ ఉన్నచోట్ల ఎక్కువ విధించడానికి పూనుకోవడం సరయిన పద్ధతి కాదేమో అనిపిస్తున్నది దానివల్ల రైతుల వ్యతిరేకతను కొని తెచ్చుకోవడం తప్ప మరేమీకాదని నేను అభిప్రాయపడుతున్నాను ఇప్పుడు దీనిని బలవంతంగా తీసుకొచ్చి సెలక్టు కమిటీలో పెట్టి ప్యాసుచేయించడానికి ప్రయత్నించేకన్న శ్రీ వావిలాల గోపాలకృష్ణయ్యగారు, శ్రీ పిల్లలమర్రి వెంకటేశ్వర్లుగారు ప్రజాభిప్రాయాన్ని సేకరించాలని తెచ్చిన మోషనును అంగీకరించాలని ప్రభు త్వాన్ని కోరుతున్నాను.

ఎలక్షనులు వచ్చినప్పుడు మనము ప్రజల దగ్గరకు పోతాము ప్రభుత్వాన్ని నడిపించడానికి, ప్రజలను పరిపాలించడానికి మేము పోతున్నాము, మీ అభిప్రాయాలు చెప్పండి అని ప్రజలను అడుగుతున్నాము కాబట్టి అదే రీతిగా ఇప్పుడు కొత్త పన్నులు వేయడానికి పూనుకుంటున్నాము, దీనికి కూడా మీ అభిప్రాయం చెప్పండి, మీరు మమ్ములను ప్రభుత్వంలోకి పంపించారు, మీ అభిప్రాయాల ననుసరించి మేము పరిపాలన చేయడానికి పూనుకుంటాము, అని అడగవలసి ఉన్నది మీరు ఓటు వేసిన తరువాత మిమ్ములను మరచిపోయే విధానం మేము అనుసరించడం లేదని రుజువు చేసుకోడానికైనా హౌసుముందుకు వచ్చిన ఈ మోషనును అంగీకరించవలెనని కోరుతున్నాను మూకుమ్మడిగా పన్నులు విధించేవిధానాన్ని ప్రభుత్వం మానుకొని రైతుల ఆర్థిక స్తోమతను వారి ఆదాయి వ్యవహారాలను దృష్టిలో పెట్టుకొని అధికాదాయం ఉన్నవారిమీదనే ఇది విధించినట్లయితే బాగుంటుంది హైదరాబాదు రాష్ట్రంలో అగ్రికల్చరల్ ఇన్‌కంటాక్సుబిల్లు ఉన్నది దానివల్ల కొద్ది ఆదాయం మాత్రమే వస్తుందని ఆర్థికమంత్రిగారు తమ బడ్జటు ఉపన్యాసంలో చెప్పారు దానిని సరిగా ఇంప్లిమెంటు చేయడంద్వారా ఎక్కువ ఆదాయాన్ని రాబట్టడానికి మార్గాలున్నాయనే దానిని ఒక ప్రాతిపదికగా తీసుకొని, ఆ పద్ధతిలో ఆలోచించి అధికాదాయం ఉన్నవారిమీద పన్నులు వేయాలి నిర్మాణ కార్యక్రమాలుండి ప్రాజెక్టులు ఉండే సస్యశ్యామలమయిన ప్రాంతాలలో ఎక్కువ ఆదాయాన్ని రాబట్టేందుకు మార్గాలున్నాయి 10 సెంట్లు భూమి ఉన్నవారిదగ్గర, 10 వేల ఎకరాలభూమి ఉన్నవారిదగ్గర ఒకే విధంగా పన్నులు వసూలు చేస్తాము అనేవిధానంవల్ల ఇవ్వేళ మనం ముందుకు పోతున్నామా, యీ డెమోక్రసీ ప్రభుత్వంలో వెనుకకు పోతున్నామా అనేది మంత్రిగారు ఆలోచించవలసిన అవసరమున్నది

ఎందుకంటే ఈ పన్నుల చట్టం తీసుకురావటంద్వారా, అగ్రికల్చరల్ ఇన్‌కమ్ టాక్సు చట్టాన్ని రద్దుచేయబోతున్నారు అది సరైన విధానమా అని ఆలోచించుట అవసరం. అంటే యిందులో స్పష్టంగా కనపడేది - భూస్వాములకు, పెద్ద ఎత్తున వ్యవసాయంద్వారా ఆదాయం పొందుతున్న వాళ్లకు కోపం రాకుండా ఉండేందుకు, వాళ్ళు ఈ ప్రభుత్వంమీద అలగకుండా ఉండేందుకు, ఈ ప్రభుత్వం ఒక ప్లాను ప్రకారం చిన్న రైతాంగంమీద పన్నులు విధించి, పెద్దవారి కోపాన్నుంచి తప్పించుకునేందుకు, అలకనుంచి తప్పించుకునేందుకు, పూనుకొంటోందని ఆలోచించవలసిన అవసరం ఏర్పడుతోంది అందుకని యివాళ పరిస్థితులలో ఆర్థికంగా అనేక రకాల కృంగి

కృశించిపోతున్న ఈ రైతాంగంమీద యీ పన్నులభారం మోపేదానికన్న, వ్యవసాయంద్వారా అధిక లాభాలు ఆర్జిస్తూ యితర వృత్తులుకూడ చేపట్టి అనేక రకాలుగా సంపాదిస్తూ, సుఖసౌఖ్యాలతో తులతూగుతున్న పైతరగతుల వారిమీద మాత్రమే యీ పన్నుల భారంపడే విధంగా సెలక్టు కమిటీ ఆలోచించాలని, ముందు ఈ బిల్లును ప్రజాభిప్రాయ సేకరణకు పంపిస్తే బాగుంటుందని, దానికి మంత్రిగారు అంగీకరిస్తారని ఆశిస్తూ ముగిస్తున్నాను

* శ్రీ కె. వెంకటరావు అధ్యక్షా, దీనిని ప్రజాభిప్రాయ సేకరణకు పంపవలసిందనే ప్రతిపాదనను నేను వ్యతిరేకిస్తున్నాను మన దేశంలో ప్లెబిసైట్ ద్వారా పరిపాలన చేసే పద్ధతి మనం పెట్టుకొనలేదు స్విట్జర్లాండ్ లాంటి చిన్న దేశాలలో యిది అవసరమై ఉండేదేమో మనం అనుభవిస్తున్నటువంటి ప్రజాస్వామ్య పద్ధతిన పరిపాలన జరిగే రాజ్యాలలో ఆ పద్ధతి లేదు ఈ విషయంలో అది ప్రత్యేకంగా అసలు అవసరం లేదు ఎందుచేతనంటే, యివాళ కొత్తగా ఏమీ తీసుకువచ్చి పెట్టడంలేదు, దేశంలో వ్యవసాయానికి నీరు కావాలి అన్నిచోట్ల నీరు లేదు, కొంత మెట్ట వ్యవసాయము, కొంత పల్లపు వ్యవసాయం ఈ పల్లపు వ్యవసాయమునకు సంబంధించి ఎంత పన్ను వసూలు చేసుకోవాలనేదే యిప్పుడు చర్చ. అందువల్ల చాలామంది సభ్యులు అసలు పునాదులు, సిద్ధాంతాలలోకి వెళ్ళి ప్రోగ్రెసివ్ టాక్సు, రిగ్రెసివ్ టాక్సు, లేక పోతే 'ability to pay' యా, అని ఈ సమస్యలు అన్నీ దీనిలోకి తీసుకు వస్తున్నారు వీటన్నిటికి సమన్వయమైనటువంటి, ఆదర్శపూర్వకమైనటువంటి tax structure కలిగిన దేశం ప్రపంచంలో ఎక్కడా లేదు దేశంయొక్క అవసరాలు, నాలుసరి ఆదాయాన్నిబట్టి రాజ్యాంగాన్ని నడిపించే బాధ్యతగూడా ఉన్నది. సాలుసరి ఆదాయాన్ని ఎక్కువచేసుకొని, దేశంలో ఉండే సౌఖ్యాన్ని యింకా పెంపొందించుకోవలసిన ఆవశ్యకత ఉన్నది ఇది మామూలుగా మాట్లాడుతూ ఉంటాము మేము మాట్లాడినా - ప్రజానీకం, ప్రజలు, ప్రతిపక్షంవారు మాట్లాడినా ప్రజానీకము, ప్రజలే అయితే ఈ ప్రజలు భాగ్యవంతులైనవారు ఎంతమంది ఉన్నారు ? దేశం అంతా బీద రైతాంగమే అసలు రైతులుకూడ కానివారు, ఈ రైతులకంటె బీదవారు ఎన్నోరెట్లు ఉన్నారనేది మరచిపోకూడదు వారికి కావలసిన సాంఘిక క్షేమాన్నికూడ మనం ఆలోచించాలి. ఒకరోజున రైలులో వస్తుంటే, ఒక స్టేషనులో ఒకాయన ప్రజానీకంమీద అంత పన్నులు వేశారేమని అడిగాడు వాళ్ల ఊరియొక్క జనాభా ఎంతని నేను అడిగాను. మూడు వేలుఅని అన్నాడు ఆఊళ్లో భూమి (పట్టా) ఉన్న రైతులు ఎంత మందని అడిగితే నూరుమంది ఉంటారని అన్నాడు అయితే మిగిలిన 2,900

మందీ ప్రజానీకమూ, అప్రజానీకమూ నాకు అర్థంకావడంలేదు ఏదైనా పన్ను, వేసేటప్పుడు అవతలివారి క్షేమము కూడ ఆలోచించాలి ప్రోగ్రెసివ్ టాక్సు, మంచి ఇన్‌కమ్‌ఉన్నచోట్ల పనిచేస్తుంది ఇప్పుడు వ్యవసాయంచేసేవారు పావలా, పన్ను యిచ్చేవారు కూడ ఉన్నారు ప్రజలను దేశం యొక్క అభ్యున్నతికి తమ యొక్క కోటాను (quota) చెల్లించమని అనేక రకాలుగా చెప్పాము- (1) ఈ పన్నులు హెచ్చుచేసుకొనమని, (2) డబ్బు మిగిల్చి ప్రభుత్వానికి small savings గా యివ్వమని, (3) యీ రెండు విధాలా యివ్వలేనివారు, తమ భుజశక్తిని యిచ్చి దేశాన్ని ముందుకు తీసుకువెళ్లేందుకు తోడ్పడమని అడుగుకున్నాము సర్వ సమగ్రమైన త్యాగబుద్ధి, బహుళప్రజానీకంలో అందరికీ రాకపోయినట్లయితే ఈ దేశం ముందుకు వెళ్లేమార్గములేదు ఇంకొక్క మార్గమే ఉన్నది,- అది ఏమంటే చేతిలో కొరడా పుచ్చుకొని "నీవు యీ రోజున 8 గంటలు ఊరికే పనిచేసి, చచ్చినట్లు పొలములో పండిన 2 బస్తాల ధాన్యంలో $1\frac{1}{2}$ బస్తా urban population ను feed చేయుటకోసం యివ్వమని" levy వేసి తీసుకువెళ్లే పద్ధతి- ఇది మన రాజ్యాంగం గాని, మనం గాని ఒప్పుకొనుటలేదు మనం నచ్చచెప్పి వ్యవహరించాలి అందరూ భాగ్యవంతులు కారు దేశం అంతా కృష్ణా, గోదావరి నదులు ప్రవహించే స్థితి, నేచరు, భగవంతుడు మనకు యివ్వలేదు కాని ఈ దేశంలో పుట్టిన ప్రతి పౌరుడు తనకు ఈ దేశం అభ్యున్నతిలో భాగం ఉన్నదని, దానికి ప్రభుత్వం పూనుకొనవలసినధర్మం ఉన్నదని ఎలా అనుకుంటున్నాడో, అదేమాదిరి తను కూడ ప్రభుత్వముతో సహకరించుట తన విద్యుక్తధర్మమని అనుకోవాలి బీద రైతాంగాన్ని మరిచిపోయి భాగ్యవంతుల సౌఖ్యం కోసం, ఈ బిల్లు తీసుకువచ్చామనే అపోహ ఉంటే, అది చాలా చింతించవలసిన విషయం నేను మనవిచేసేది- ఈదేశంలో standard of living మనం అనుకున్న స్థాయికి తీసుకువెళ్లేదాకా— అందుకు ఎన్ని పంచవర్ష ప్రణాళికలు అవసరమైనప్పటికీ— ప్రతి వ్యక్తి తమయొక్క సంపాదనలో ఒక భాగం యివ్వకతీరదు అది ఎంత పుచ్చుకోవాలనేది, ఆ సంవత్సరములో, ఆ ప్రణాళికా కాలములో ఉన్న అవసరాలనుబట్టి ఉంటుంది కొందరు morality గురించి, కొందరు equality, justice గురించి మాట్లాడారు ఇటువంటివి డిక్షనరీలో చాలా పదాలు ఉన్నవి. వీటిని ప్రయోగించి లాభంలేదు. మనం పరిపాలనలో ఒకభాగం, ప్రభుత్వానికి morals ఉంటే మనకూఉంటాయి. ప్రభుత్వానికి లేకపోతే మనకూలేవు. అనేసంగతి సభ్యులు గ్రహించటం మంచిది. ఇది reflection, అద్దంలో చూచుకుంటే ముఖము ఎట్లా కనిపిస్తుందో మన సంఘంలోని స్వరూపమే మనమంతా, varying degrees లో ఉండవచ్చును. We are

**reflection of the society** దానికంటె మనము మంచివాళ్ళము కాదు దాని కంటె మనము చెడ్డవాళ్లము కాదు మళ్ళీ మీరు అందులో ఒక గ్రేషికనుక మీకు మేము **reflection** మీరు మంచివాళ్ళయితే మేము మంచివాళ్ళము. మీరు చెడ్డవాళ్ళయితె మేము చెడ్డవాళ్ళము అందువలన మిమ్ములను విడదీసి 'మీ ప్రభుత్వం' అంటేకాదు, అంతామనమే మన ద్వారా జరిగేది జరుగుతుంది, లేకపోతె లేదు.

ఢిల్లీనుంచి ఏమి తేవటంలేదంటూరు శ్రీ పిల్లలమర్రి వెంకటేశ్వర్లు ఏమీ రాకుండాఎలా జరుగుతోంది ? ఈ ఏడు బడ్జెటులో 34 కోట్లు ఖర్చు పెట్టుతుంటే, 18½కోట్లు వారు అప్పుయివ్వాలి ఈ అప్పు కాకుండా, **tax division** లో డబ్బు యివ్వాలి ఏటా పూర్తిచేసుకొనవలసిన అయిదారు కోట్లు చేసుకొనలేక ఒక కోటి, రెండుకోట్లు పన్ను వేసుకొని యింకా **accumulated deficit** తీసుకు వెళ్ళుతుంటే మిగిలిన రాష్ట్రాలలో **deficit** ఎక్కువ ఉన్నదా లేదా అని సభ్యులు అడుగుతారు అయితే వారికివచ్చే ఆదాయం ఎంత ? ఆంధ్రప్రదేశ్ బడ్జెట్ 49 కోట్లు అయితే, యింకా ఎక్కువ డెఫిసిట్ ఉన్నవారికి 100 కోట్లు ఆదాయం వస్తుంది అది లెక్క వేసుకొన నక్కరలేదా ? ఆంధ్రరాష్ట్రం భారత దేశంలోని అన్ని రాష్ట్రాలకన్నా అన్నివిధాలా బాగున్నదని చెపుతాను ఆ దృష్టి లేకపోతే 5 89 కోట్లు బడ్జెటు డిఫిసిట్ చూపించడం ఎందుకు ? 16 కోట్లు **ways and means provision** లో **Reserve Bank** నుంచి **over draft** తెచ్చు కొనుట ఎందుకు ? మంత్రులు వెయ్యి రూపాయలు జీతం పుచ్చుకుంటున్నారని విమర్శిస్తారు. కాని మేము పెట్టే అన్ని ఖర్చులు కలిపి 2 లక్షలుకూడ కావు దీనివల్ల దేశానికి ఏమీ పోవడంలేదు మీరందరూ పుచ్చుకొన్నందువల్ల జరగక పోవటంలేదు ఇంకా ఎక్కువ సౌకర్యాలు కావాలి ఇక్కడ **air condition** పెట్టి వెంకటేశ్వర్లుగారిబుర్ర చల్లనంగా అట్టిపెట్టి వ్యవహారం సాగిద్దామని ఉద్దేశం ఇవి అన్నీ విమర్శకోసం అనుకునేవి అసలు దేశం మొత్తంకోసం చేయవలసిన పని ఎక్కువ ఉన్నది జనం ఎక్కువ ఉన్నారు వాళ్ళ క్షేమం ఆలోచించాలి అందువల్లి ఈపన్నులు వేయకతప్పదు నిజంగా చేయవలసిన విమర్శ ఏమంటే, యిది సమయమా ? ఎంత పన్ను వేయాలి ? దేనిమీద ఎంత పన్ను వేయాలి ? వాటర్ రేటు వేయవచ్చా, ఇన్‌కంటాక్స్ ఉండాలా, సర్చార్జి వేయాలా, కమర్షియల్ క్రాప్స్ మీద పన్ను వేయాలా, అన్నది నిజంగా ఆలో చించవలసిన విషయము. "సత్యంవద, ధర్మంచర" అంటూ శాస్త్రాలు చెబితే వ్యవహారం సాగదు కనుక భూగోళంమీద ఉన్నటువంటి పరిస్థితులు ఆలోచించు

కాని సభ్యులు విమర్శచేస్తే బాగుంటుందని చెబుతున్నాను ఇవాళ 12 గురు మిత్రులు మాట్లాడారు ప్రొహిబిషన్ ఎందుకు అని కొందరు అంటున్నారు ఏ విషయముతీసుకువచ్చినా, ప్రొహిబిషన్ తీసి వెయాలనేచెబుతున్నారు ప్రతివిషయానికి ప్రొహిబిషన్ సంగతి తెస్తారు మనం ప్రొహిబిషన్‌ను ఒక సిద్ధాంతంక్రింద పెట్టుకొన్నాము ఇది యాన్యువల్ బడ్జెటులో భాగమైతే, ఎంత రేటు వేయటం అని ఆలోచించుకోవచ్చు అదికాదు వ్యవహారం ఒక సిద్ధాంతం క్రింద ప్రొహిబిషన్ ఉండాలని అనుకొన్నాము ప్రొహిబిషన్‌ను రూపాయలు అణాలు పైసలతో కొలిచే వ్యవహారం కాదు ప్రొహిబిషన్ యొక్క లాభం ధర్మామీటర్ పెట్టి కొలిస్తే దొరకదు ఇదివరకు రాత్రిళ్లు తెల్లవార్లు దెబ్బలుతిని కార్చిన కన్నీళ్ళు రక్తపుబొట్లు క్రింద లెక్కచూస్తే, ప్రొహిబిషన్ ఆరుకోట్లో, ఎనిమిది కోట్లో ఎంతో తెలుస్తుంది, ఆటంబాంబు రాకెట్ కనిపెడుతున్నారు గాని, మనిషి యొక్క సామర్థ్యాన్ని, మనిషియొక్క అభిప్రాయాన్ని కొలిచే యంత్రం కనిపెట్టటంలేదు రాకెట్‌తోపాటు అటువంటి యంత్రం కూడ కనిపెడితే రష్యాకు కృతజ్ఞత చెబుతాము సోషల్ ఎఫెక్ట్స్ ఆఫ్ లెజిస్లేషన్ మెజరబుల్ కావు అవి కొలతకు దొరకనటువంటి విషయాలు కాబట్టి వాటి విషయం ప్రత్యేకించి మాట్లాడటానికి వీలులేదు అప్పారావుగారు కూడా ప్రొహిబిషన్ ఉండాలని చెప్పి, ఎలెక్షన్సులో పోటీచేశారు ఇవాళ ఒక్కరోజులో వారి మనస్సు మారిపోవలసిన అవసరంలేదు గోపాలకృష్ణయ్యగారు ఎక్కువగా జనరల్ విషయాలు మాట్లాడారు "ఆంధ్రప్రాంతంలో 300 కోట్ల ఎగ్రికల్చరల్ ఇన్‌కం ఉన్నది, ఎగ్రికల్చరల్ ప్రొడ్యూస్ మీద ఎందుకు టాక్స్ వేయకూడదు?" అని వారు ఒక సిద్ధాంతాన్ని లేవదీశారు మనం 62 పర్సెంటు ఆఫ్ నేషనల్ ఇన్‌కం వసూలు చేస్తున్నామని వారు అంటున్నారు ఆ పరిస్థితి దేశంలో రాలేదు 1955-56 లో నేషనల్ ఇన్‌కం, 10,180 కోట్లు. దీనిలో గవర్నమెంటు 62 పర్సెంటు వసూలుచేస్తోందంటే అర్థంలేదు ఆ స్థితి ఇంకా రాలేదు 5 పర్సెంటు, 10 పర్సెంటు. 8 పర్సెంటులో రెండున్నర పర్ కేపిటా ఉన్నటువంటి యీ రోజున, దానిలో ఒక అణా కలిపితే గవర్నమెంటుకు లాభం వస్తుంది ఆ అణా తీసివేస్తే కొందరికి లాభం కలగవచ్చును. దానిని నేను అంగీకరిస్తున్నాను కాని ఒక అణా శాక్రిఫైస్ తోటి, యీ దేశాన్ని 8 రూపాయలు తెచ్చుకొనే పరిస్థితికి తీసుకువెళ్లే అవకాశాన్ని మనం విడగొట్టుకోవలసిన న్యాయంలేదని మనవిచేస్తున్నాను. లచ్చన్నగారు "పన్నులు వేయటం న్యాయమే, కాని నీటివనరులను మరమ్మతుచేయించండి" అన్నారు కాబినెట్‌లో వెంకటరావుగారు గోదావరి కష్టాలు చెప్పారని అన్నారు వారూ శ్రీకాకుళం

కష్టాలు చెప్పినమాట నిజమే గోదావరి డెల్టాలో పండుతుంది నిజమే దానిలో ఏమీ అబద్ధం లేదు, కాని, ఆదిలాబాద్ జిల్లాలో చ మైలుకు 120 మంది జనం ఉంటే, అమలాపురం తాలూకాలో చ. మైలుకు 1500 మంది ఉన్నారు ఆ బాధలు అక్కడకూడ ఉన్నాయి ఆ విషయాలు నేను చెప్పనక్కరలేదు ఎక్కడైనాసరే సౌకర్యాలు చేయాలి ప్రతిచోటా సౌఖ్యం తీసుకురావాలి మనం నీటివనరులను బాగుచేయించుకోవలసిందే ఇంకా ఎక్కువ నీటివనరులను తీసుకోవాలి ఎక్కువపంట పండించుకోవాలి అందరికీ కడుపు నిండాలి గవర్న మెంటుకు ఒక కార్యక్రమం ఉన్నది ప్రాజెక్టులకొరకు కొన్ని కోట్లరూపాయలు కేటాయించబడినవి కొన్ని ప్రాజెక్టులు అప్పుడే మొదలుపెట్టబడినవి ఆ కార్య క్రమం శ్రీకాకుళం జిల్లాలోను జరుగుతాయి ఆదిలాబాద్ జిల్లాలోను జరుగు తాయి, నిజామాబాద్ జిల్లాలోనూ జరుగుతాయి కాబట్టి యీ కార్యక్రమం అందరి సలహాతోటి, త్వరగా శీఘ్రగమనంతో ముందుకు తీసుకుపోయే యత్నం జరుగుతుంది కొందరు జమీన్ ప్రాంతాలు గురించి చెప్పారు జమీన్ ప్రాంతాల్లో కష్టాలు కొద్దిగా ఎక్కువగా ఉన్నమాటనిజమే అందులో ఏమీఅనుమానంలేదు కారణం ఏమిటంటే, అక్కడ చాలారోజులనుండి చెరువులు మరమ్మతు చేయ బడలేదు నీటివనరులు మరమ్మతు చేయబడలేదు అక్కడ ఎక్కువ కష్టాలు ఉన్నవి అందువల్ల పంచవర్ష ప్రణాళికలో 50 లక్షల రూపాయలు ప్రత్యేకంగా జమీన్ ఏరియాలోని మైనర్ ఇరిగేషన్ వర్క్సు కోసం పెట్టారు

శ్రీ ఆర్ వి రామకృష్ణరాజా ఈ 50 లక్షల రూపాయలు ఎక్కడ ఉన్నవో తెలియదండి మొన్న మంత్రిగారు సెలవిస్తూ 30 లక్షలు దేనిక్రిందనో అయిపోయాయి, ఇంకోదానికి 30 లక్షలు అయిపోయాయి, ప్రస్తుతం ఆడబ్బు లేదని చెప్పారు

* శ్రీ కె. వెంకటరావు . అసలు, ప్రతిసాలుకు 30 లక్షల రూపాయలు బడ్జెటులో మైనర్ ఇరిగేషన్ వర్క్సుకు కేటాయించటం ఉంటుంది ఇదిగాక, నాలుగుకోట్ల పైచిల్లర, మైనర్ ఇరిగేషన్ యొక్క ఇంప్రూవ్ మెంట్ కోసం యీ ప్లానులో ప్రొవిజన్ ఉన్నది ఈ డబ్బు వినియోగించుకొనే యత్నం జరుగుతుంది. సభ్యులు చెప్పినట్లు కొంత ఖర్చు అయినమాట నిజము. కార్వేటి నగరప్రాంతంలో ఖర్చుపెట్టటం జరగలేదేమో. అటువంటి లోపాలు జరిగితే వాటిని పరిశీలించటానికి ప్రభుత్వానికి అభ్యంతరం ఉండదు. వాద్రేవు గోపాల కృష్ణగారు మాట్లాడుతూ, కొండవాగులలోంచి నీరు వస్తుందన్నారు. గోదావరికి కూడా కొండల్లోనుంచే నీరు వస్తుంది. ఏలేరు ఎలా పుట్టిందో, గోదావరి కూడ

అలాగే పుట్టింది గోదావరి త్రియంబకంలో ఆవుబొమ్మనోట్లోంచి వస్తోంది గోదావరి కొండవాగు కృష్ణ కొండవాగు, ఏలేరు కూడ కొండవాగు వాన కురిస్తే, ఏలేరులో నీరు ప్రవహిస్తే, గోదావరి క్రిందకంటె, ఏలేరుక్రింద ఉన్నభూమిలో మూడురెట్లు ఎక్కువపంట పండుతుంది అసలు వారు చెప్పదలచుకొంది, ఏలేరుమీద ప్రాజెక్టు కట్టమని ఆ విషయం మరచిపోయి మోరల్ ప్రీచింగ్‌లోకి వెళ్ళారు ఏలేరుకు కట్టకట్టే విషయం ప్రభుత్వ ఆలోచనలో ఉన్నది ఆలోచన స్టేజికూడ దాటి పరిస్థితి ఇంకా ముందుకు వెళ్ళిందని వారికి తెలియజేస్తున్నాను

చంగల్రాయ నాయుడుగారు "టాక్స్ ఓన్లీ వన్స్" అని అన్నారు వాటర్ రేట్ అని, వాటర్ ఎసెస్‌మెంట్ అని, ల్యాండ్ టాక్సు అని సర్చార్జి అని వేరువేరుగా కాకుండా ఒకటే పన్ను భూమిమీద వేయమని వారు చెప్పారు ఆ విషయాలన్నీ ఆలోచించటానికి ఒక కమిటీ వేస్తామని మనవి చేశాను కమిటీ వారు కంబైండ్‌టాక్స్ గురించి, ఏవైనా సిద్ధాంతాలు పోషించేరీతిగా సూచించినట్లయితే, వాటినిగురించి ఆలోచించటానికి ప్రభుత్వానికి అభ్యంతరంలేదు "లిమిట్ ది టాక్స్ టు దిస్ ఇయర్" అన్నారు దానికి నేను అంగీకరించాము లక్ష్మీకాంతమ్మగారు పన్నులు వేయవలసిన అవసరంగురించి, దేశాన్ని బాగు చేయవలసిన అవసరం గురించి చెప్పారు

శ్రీ రామమూర్తిగారు అమ్రేడితాల్లో చెప్పటంలో చాలా ఘనులు దానినే ఇంగ్లీషులో ఎలిట్రేషన్ అంటారు వారు ప్రతిఘటనగురించి మాట్లాడారు ఎవరికి ప్రతిఘటన ? ప్రభుత్వాన్ని ప్రతిఘటన చేయవలసిన అవరంలేదు ప్రతిఘటన వస్తుందనే దృక్పథంతోటి శాసనాలు చేయటం మొదలుపెడితే ఎట్లా సాగుతుంది ? అది సరైన దృష్టికాదని మనవి చేస్తున్నాను టాక్స్ వేయని గవర్నమెంటు సృష్టిలోలేదు. టాక్సేషన్ తీసేసే ప్రభుత్వంలేదు

ఇంకొక ముఖ్యమైన point ఏమిటంటే, ఎక్కువమంది దొరువుల క్రింద రెండు వందలేసి ఎకరాల భూమి ఉన్నవారు ఉన్నారు ఆ భూమిపైన యీ పన్ను పడుతుందా, లేదా అనే విషయమునుగురించి అడిగారు. ఆ విషయము సెలెక్టు కమిటీవారు ఆలోచిస్తామని అన్నారు. వారు ఆలోచిస్తారనే నేను అనుకుంటున్నాను. గౌ॥ సభ్యులు శ్రీ కె యల్ నరసింహారావుగారు చెప్పిన దానికి గూడ జవాబు చెప్పాను "Even those that cannot pay must sacrifice bus fare" అదే పొదుపు ఉద్యమానికి basic principle అవేది కావాలి ఒకపూట అన్నంమానిఅయినా, "నా దేశము బాగుపడాలి అనే

దృష్టిలోకి మనము వెళ్ళాలి Ofcourse ఆ decision కు రావాలంటే చాలా difficult matter మనకు విశ్వాసము ఉంటే మాత్రం అది కొంత మంత్రులలో వచ్చింది నేను ఆ మధ్యన మనవిచేశాను ఏమని అంటే, జర్మనీలో గత యుద్ధములో bomb craters పెట్టితే ప్రజానీకం అంతా అందులో కాపురము ఉండి industries ను build up చేసి ఎంత వరకు వారిదేశము వృద్ధికి తెచ్చుకున్నారంటే, ఆ రోజులలో 12 లక్షల రూపాయలకు ఒక్కొక్క రైల్వేయింజను అమ్మేది ఈరోజులలో దానిని 8 లక్షలకే పంపుతున్నారు దీనినిబట్టి పది సంవత్సరములలో వాళ్ళు దేశములోని industries ను ఎంత అభివృద్ధికి తెచ్చుకున్నారో గుర్తించండి కనుక disciplined life అంటే అదే అది people లోనూ, ప్రభుత్వంలోనూ, సభ్యులలోనూ, అందరిలోనూకూడ వచ్చేటట్లయితే, ఏదేశము అయినను అభివృద్ధికి తెచ్చుకోటానికి ఏలోపముకూడ ఉండదు కాని ఆ element of sacrifice మనము అందరికీ బోధించాలికాని, దాన్ని deprecate చేస్తేమాత్రం కాదు ఎవరికైనా, లేదు, లేదు, లేదు అనేభావం ఉంచుకునే దానికంటె ఉన్నది, ఉన్నది, ఉన్నది అని అనుకునేటట్లయితే చాలా బాగా, నడుస్తుందేమోనని నా అభిప్రాయము తరువాత ఒకరు యిద్దరు సభ్యులు తెలంగాణలో ఈ assessment ను గురించి మాట్లాడారు నేను మొదట్లో మాట్లాడేటప్పుడే సూచించాను అది ఆంధ్రలో ఉన్న level కంటే, ఎక్కువగా ఉన్నమాట నిజమే అసలు మనము fix చేసుకోవలసిన level తెలంగాణ level లోనా, లేకపోతే, మిగిలినచోట్లలో ఉన్న level లోనా, అనేది తేలిపోతే, తెలంగాణా level ను తగ్గించుకోవడమో, లేక ఆంధ్రలోని level పెంచ్చించడమో నిర్ణయించుకోవచ్చు అందువల్లనే మనము దీని విషయములో ఒక step తీసుకోవాలని అనుకున్నప్పటికినీ తొందరపడి యిప్పుడు దీనిని 15 రూపాయలకు తగ్గించాలని అనుకున్నాము మరల రేపు ప్రొద్దున 18 రూపాయలు ఉంటే బాగా ఉండదని త్వరలో యీ బడ్జటు సమావేశము ముగిసే లోపలనే దీన్ని పూర్తిచేయలనే ఉద్దేశ్యముతో కమిటీని వేయడము, ఆ కమిటీ యిచ్చే సలహాలన్నీ మరల చర్చించుకుని, దీనియొక్క పర్యవసానము తేల్చుకోవచ్చు "

శ్రీ కె. యల్. నరసింహారావు : కమిటీని వేశారా ? వేస్తారా ?

శ్రీ కె. వెంకటరావు : కమిటీని వేస్తాననే చెప్పాను. బహుశః మూడు నాలుగు రోజులలో కమిటీలోని మెంబర్ల పేర్లుకూడ చెబుతాము మన కల్లూరు సుబ్బారావుగారికి ఏమిబాధ ? ఆయనకు నాకు ఒకటేబాధ. ఇద్దరికి ఒకటేభూమి ఉంది భూమి ఉన్నవాళ్ళు ఎవరెవరో బాధపడుతారు కాని, ఈ విషయమును గురించిన బాధ సుబ్బారావుగారికి ఎందుకు ?

తరువాత మన రామకృష్ణరాజుగారు చాలా సబబుగానే మాట్లాడారు. కాని ఆయన యింకను నాలుగు గజములు యివతల కూర్చునిఉండి ఉంటే, యింకొక విధముగ మాట్లాడేవారే ఇదివరకు ఆయన మద్రాసు Legislative Council Chairman గా ఉండేవారు అప్పుడు ఆయనకు బాగా పూచీ ఉండేది అక్కడ మేము పెట్టిన బిల్సు అన్నీ తనయొక్క యిష్టాయిష్టాలను చూడకుండా support చేసేవారు కాని యిప్పుడు దానికి కొంచెము qualification కావలసి యున్నది కాంగ్రెసు పార్టీ యొక్క అభివృద్ధి కావాలి రూలింగు పార్టీ యొక్క అభివృద్ధి కావాలి కాని, కుండకు ఎక్కడైనా ఒక చిన్న రంధ్రము కొట్టాలనే వారియొక్క కోరిక

శ్రీ ఆర్ బి. రామకృష్ణరాజు కుండకు రంధ్రము కొట్టాలనే అభిప్రాయము నాకు లేదని చెప్పానండి

శ్రీ కె వెంకటరావు సరే మంచిదే ఇప్పుడు నేను మనవిచేసేది ఏమిటంటే వారు నాతోబాటు M Ps యిచ్చే సలహాలు వారుకూడ పాటించవలసిందిగా కోరుతున్నాను మనకు యీ పన్నులతోబాటు యితర పన్నులు కూడ ఉంటాయి గనుక, ఆంధ్ర ప్రాంతములోని జనాన్ని నీరా త్రాగమని తెలంగాణలోని వారినందరినీ సారా త్రాగమని ప్రబోధము చేయవలసినదని వారి కోరిక మరి మనకు డబ్బు కావాలంటే మరొక మార్గము కన్పించడము లేదు గనుక, ఆయన చెప్పిన పద్ధతే గనుక అవలంబిస్తే మనకు డబ్బు దొరుకుతుంది ఇప్పుడు నేను మనవిచేసేది ఏమిటంటే, ఇప్పుడు ఇది ఏదో extraordinary గా కనబడుతున్నా, కాంగ్రెసు సభ్యులు చేసేది ఆ స ం ఘ ము లో విప్లవం పునాదిగా తెచ్చి ఆర్థిక వ్యవస్థను వమ్ముచేసే బిల్లు ఏమీ కాదు యిది అందువల్ల యీ బిల్లును సెలెక్టు కమిటీకి పంపించి అక్కడ చేసేటటువంటి నిర్ణయములతోటి మనము తిరిగి ఆలోచించి శాసనము చేయవలసిందిగా కోరుతున్నాను.

మిస్టర్ స్పీకర్ ఇప్పుడు యీ బిల్లును సెలెక్టు కమిటీకి పంపవలసిందిగా మంత్రిగారు ఉపపాదించారు దీనికి సవరణ వావిలాల గోపాలకృష్ణయ్యగారు, వేమయ్యగారు, నాగిరెడ్డిగారు, విశ్వేశ్వరరావుగారు యిచ్చారు

"That the Bill be circulated for the purpose of eliciting public opinion." అని. అంటే దీనిని ప్రజాభిప్రాయానికి పంపవలసిందని సవరణ యిచ్చారు. ఇది సభ ఎదుట ఓటుకు పెట్టుతున్నాను

The question is

"That the Bill be circulated for the purpose of eliciting public opinion"

The motion was negatived

*Mr Speaker* I shall put the Government motion to vote The question is

"That the Andhra Land Revenue (Additional Wet Assessment) (Andhra Pradesh Amendment) Bill, 1957, be referred to a Select Committee composed of

1 Sri Kala Venkata Rao (Minister)
2 Dr B Gopala Reddy (Minister)
3 Sri R Tirupathi Rao
4 K Sri Vijaya Bhasker Reddy
5 Sri P V Narasimha Rao
6 Sri P Venkata Subbayya
7 Srimati Y Seetha Kumari
8 Sri J B. Muthyal Rao
9 Sri Ranga Reddy (Balkonda)
10 Sri P. Sundarayya
11. Sri G Yellamanda Reddy
12 Sri C Rajeswara Rao
13 Sri P. Narasinga Rao
14. Sri T. Papa Rao
15 Sri P Sreeramulu
16. Sri Kristamachari"

The motion was accepted

*Mr. Speaker* : I nominate Sri K Venkata Rao as the Chairman of the Select Committee.

ఈ రోజున యింతటితో కార్యక్రమము ముగిసింది రేపు ఆహార సమస్యను గురించి చర్చపెట్టుకుందాము

శ్రీ వావిలాల గోపాలకృష్ణయ్య అధ్యక్షా, ఈ కమిటీలో కృష్ణమాచారి గారిని వేశామని అంటున్నారు. ఆయన తెలంగాణ నుంచి వచ్చిన సభ్యుడు ఈ బిల్లు ఆంధ్రకు సంబంధించినది గనుక ఆయన పేరు మార్చి యింకొకరి పేరు

వేయవలసి ఉంటుంది ఆంధ్రకు సంబంధించినవాడిని ప్రస్తుతం నేను ఒక్కడినే ఉన్నాను గనుక నా పేరు వేయమని కోరుతున్నాను

శ్రీ యన్ సంజీవరెడ్డి కృష్ణమాచారిగారు రానని రాజీనామా యిచ్చి నట్లయితే అప్పుడు ఆలోచిస్తాము

శ్రీ వావిలాల గోపాలకృష్ణయ్య అసలు ఈ కమిటీలోని పేర్ల సభలో ఉన్న అన్ని groups తరఫున వేస్తామని ఒప్పుకున్నప్పుడు మా గ్రూపులోనివారిని వేయకుండా చేయడము న్యాయముకాదు ఈ విషయము మంత్రిగారు పున రాలోచించవలసిందిగా కోరుతున్నాను

డాక్టరు బి గోపాలరెడ్డి అయితే తెలంగాణ సభ్యుడు ఈ కమిటీలో ఉండకూడదని వారి ఉద్దేశ్యమా ?

శ్రీ వావిలాల గోపాలకృష్ణయ్య తెలంగాణవారు ఉండకూడదని కాదు

డాక్టరు బి గోపాలరెడ్డి అయితే, కృష్ణమాచారిగారు ఈ కమిటీలో ఉంచే ఏమి ?

శ్రీ వావిలాల గోపాలకృష్ణయ్య ఇక్కడ మా గ్రూపువారి అభిప్రాయము అదే

*Mr Speaker* It is stated in the Rules

"The mover shall ascertain whether such member proposed to be named by him is willing to serve on the Committee "

కృష్ణమాచారిగారు ఒప్పుకున్నారా ? ఒప్పుకోకపోతే ఆ పేరు చెల్లదు

శ్రీ యన్ సంజీవరెడ్డి వారు ఒప్పుకోకపోతే యింకొకరి పేరును వేసుకుంటాము

మిస్టర్ స్పీకర్ . కృష్ణమాచారిగారు ఒప్పుకోలేదా ? సరే, లేదని, వారిని అడిగలేదని మంత్రిగారు అంటున్నారు

శ్రీ కె. వెంకటరావు . నేను కమిటీసభ్యుల పేర్లవిషయములో సభ్యులను అడగడము నాకు అలవాటులేదు ఈపేర్లు మన ముఖ్యమంత్రిగారు తెచ్చియిస్తూ వుంటారు అవి అంగీకరించడము సాంప్రదాయము అయింది కాని యిలాంటి

అభిప్రాయ భేదాలు ఎందువల్ల వచ్చినవో నాకు అర్థముకాలేదు అయినా ప్రజలకు సేవచేయడమునకు కృష్ణమాచారిగారు ఈ మెంబరుషిప్పు నాకు అక్కర లేదు అని అంటే, అప్పుడు చూద్దాము

శ్రీ వావిలాల గోపాలకృష్ణయ్య మంత్రిగారు అలాంటి అభిప్రాయముతో ఉంటే వారిని అంగీకరించమని కోరితే, వారు అంగీకరిస్తారు కూడా

శ్రీ పి సుందరయ్య అధ్యక్షా, ఇది చాలా దురదృష్టకరముగా వస్తున్నది సభలోని groups తరపున మెంబర్లను వేస్తామని చెప్పినప్పుడు, group leader ఏ పేర్లు యిస్తే వాటిని accept చేయాలనే ఒప్పుదల సాంప్రదాయము కూడ ఇప్పుడు గోపాలకృష్ణయ్యగారు కూడ ఒక గ్రూపు లీడరే గనుక ఆయన పేరు యిస్తామని వస్తున్నప్పుడు, ముఖ్యమంత్రిగారు ఆ పేరు కనుక్కొని ఆ పేరు accept చేయాల్సివున్నది అలా గాకుండా, ఆయనను సంప్రదించకుండా యింకొకరి పేరు వేశామని అంటే, అది న్యాయము కాదు, సబబుకాదు సరే వారు ఏ పేరు యివ్వాలనుకున్నారో, ఏమి జరిగిందో, ఆ details లోకి నేను పోదలచుకోలేదు ఇప్పుడు ఆయన ఒక గ్రూపు లీడరుగా ఉండి, ఆయన యిచ్చిన పేరు accept చేయాలి గాని, ఎవరిపేరో వేసి, ఆయన రాజీనామా యిస్తే అప్పుడు ఆలోచిస్తామని, దాన్ని మరల యీ House ముందుకు తెచ్చి ప్రతిపాదించి ఆమోదించడము సరైన పద్ధతి కాదు

మిస్టర్ స్పీకర్ అయితే యిందును గురించి ఒక విషయము జరిగింది పేరు ఏమో ప్యానుఅయింది ఒకసారి సభలో పేరు చదివి, announce చేసిన తరువాత, ఆ పేరు అవసరములేదంటే, వారిని consult చేసి మరొకరిని consult చేసి, అవసరమైతే వేసుకోవచ్చు అందులో యిది ముఖ్యమైన subject గనుక, అది ప్యానుచేశాము—

రేపటిరోజు కార్యక్రమము ఆహారసమస్యమీద సమగ్రమైనచర్చచేద్దాము తరువాత 7, 8 తేదీలు రెవిన్యూ మంత్రిగారి రెండు పన్ను బిల్లులు ఉన్నవి అవి భూమి assessment కు సంబంధించినవి. 9 వ తేదిన ఆంధ్ర యూనివర్సిటీ బిల్లు, తరువాత వెంకటేశ్వర యూనివర్సిటీ బిల్లు ఆ తరువాత భద్రాచలము బోటు ట్రాజడీని గురించిన చర్చ 10 వ తేది ఆదివారము అయింది. ఎసెంబ్లీ లేదు. 11 వ తేది Non-official Day 12, 13 వ తేదీలు గవర్నరుగారి Ordinance కు సంబంధించిన బిల్లు, తీసుకుంటాము అంతవరకు ఉన్న కార్యక్రమము యీవిధముగ నిర్ణయించడము జరిగినది. ఈ నెల 20 వ తేదీతో మాత్రం యీ

మీటింగ్ close చేస్తాము 14 వ తారీఖునుంచి 20 వ తేదీదాకా ఏమేమి చేయాలో అది Business Advisory Committee సమావేశమై నిర్ణయిస్తారు

శ్రీ పి గోపాలరెడ్డి (తిరుత్తని-జనరల్) అధ్యక్షా, పటాస్కర్ రిపోర్టును గురించిన చర్చకు అవకాశము యిస్తామని అన్నారు అది ఎప్పుడు యిస్తారో తెలియలేదు. ఈ నెల 13 వ తేదీవరకు వీలుకాదన్నట్లు తెలుస్తున్నది

మిస్టర్ స్పీకర్ అది అంతా Business Advisory Committee చేయవలసి యున్నది నేను ఏమీ చెప్పలేను.

శ్రీ వావిలాల గోపాలకృష్ణయ్య అధ్యక్షా, ఎప్పుడు జరిగేది తెల్పడము Business Advisory Committee వారిపని అని అంటున్నారు అందువల్ల చర్చ జరగడము అనేది మాత్రము ఉన్నదని మేము అభిప్రాయ పడుతున్నాము. అయితే Business Advisory Committee అనేది ఎప్పుడు తేల్చి, నిర్ణయిస్తుంది?

మిస్టర్ స్పీకర్ ఎప్పుడు, ఎంతసేపు చర్చ యీ విషయములు ఏవీ నేను యిప్పుడు చెప్పలేను

శ్రీ వావిలాల గోపాలకృష్ణయ్య ఈ subject ను గురించి చర్చించాలనేది, అది ఎప్పుడు చేయాలి అనేది Business Advisory Committee నిర్ణయము చేస్తుంది అని అనుకుంటున్నాము ఆమాదిరిగా అనుకోమంటారా ? మీరు చెప్పినదే మంత్రిగారి అభిప్రాయముగా అనుకోమంటారా ? లేకపోతే మేముపొరబాటు పడ్డామని అనుకోమంటారా ?

మిస్టర్ స్పీకర్ నేను యింతవరకు ఒక పెద్దలిస్టు చదివాను గదా ! ఈ సెషనులో అయిపోతాయా అని, యివి అన్నీ అవుతాయా అని, యిలాంటి ప్రశ్నలు నన్ను వేస్తే, యిదికూడ అందులోనిదే అనుకోండి అవుతుందో లేదో నేను యిప్పుడు ఏమీచెప్పలేను List చదివాను. ఇందాక మన సభ్యులు కొన్ని సందేహాలు చెప్పారు, ఈ బిల్లులు Select Commnitte లో అవి వస్తాయా, రావా, అని అడిగారు List ను బట్టి అది అంతాకూడ చేస్తామని నేను అనుకోవడములేదు అది అంతా యిప్పుడు ఏమీలేదు 14 వ తేదీనుంచి ఏమిజరిగేది రేపు 9 వ తేదీన Business Advisory Committee సమావేశమై నిర్ణయిస్తుంది. ఇవి అన్నీ వస్తాయోరావో నేను యిప్పుడు ఏమీ చెప్పలేను.

శ్రీ యన్ పి చంగల్రాయనాయుడు అధ్యక్షా ఈ పటాస్కర్ రిపోర్టు కొన్ని లక్షలమందికి సంబంధించిన విషయము Border లో చాలా తీవ్ర పరిస్థితులు ఏర్పడుతున్నవి కొన్ని బిల్లులు ఈ సెషన్‌లో ప్యాసు కాకపోయినా మరొక సెషన్‌లో ప్యాసుచేసుకోవచ్చు ఇది చాలా ముఖ్యమైన విషయము గనుక యీ రిపోర్టువిషయము Business Advisory Committee లో ఆలోచించేటట్లు చేసి, దాన్ని త్వరలో సభముందు చర్చకు వచ్చేటట్లుగా చూడాలని కోరుతున్నాను ముఖ్యమంత్రిగారు కూడ దీనికి ఒక గంటో, రెండుగంటలో చర్చకు ఏర్పాటుచేస్తానని సెలవిచ్చారు అందువల్ల దీనిని యీ సెషన్‌లోనే సాధ్యమైనంత త్వరలో వచ్చేటట్లు చేయమని కోరుతున్నాను

మిస్టర్ స్పీకర్ మీ అభిప్రాయాలను గురించి నాకు సానుభూతి వున్నది ఈ సంగతి Business Advisory Committee లో చెబుతాను వారి యొక్క ఉద్దేశ్యము పర్యవసానము మీకు తరువాత వెల్లడిచేస్తాను

ప్రస్తుతం యీ సభ వాయిదా వేయడమైనది రేపు ఉదయం 8-30 గంటలకు మరల సమావేశము అవుదాము

*The House then adjourned till Half Past Eight of the Clock on Wedensday, the 6th November 57.*